

కలకత్తా జైనదేవాలయం

ఫోటో: పి. వి. రెడ్డి—కర్నూలు.

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.



సంపుటము 40
సంచిక 9
2-11-55

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

మన్మథ ఆశ్వయుజ బహుళ తదియ బుధవారం

కాశ్మీరు, డాల్ సరస్సులో పూల విక్రయం. —ఫోటో: పి. సి. రెడ్డి, కర్నూలు.

ముఖచిత్రం: సినీ నటి జ్యోతి.

# విషయానుక్రమణిక


చిత్రమాలిక — 8
అబల — 9
పార్వతి — 18
మిత్రలాభం — 21
పేరులో నేమి... — 25
నాగపూర్ కథలు — 27
జాతీయారోగ్య సేవా సమితి — 32
బాలసాహితి — 35
కథాగేయ సుధానిధి — 36
మార్టిన్ రాట్లర్ — (సీరియల్) 38
బెలూన్ దొంగలు — 42
న్యాయమే జయిస్తుంది — 46
సినిమా — 50

# చిత్రమాలిక

ఏంతులు–శాస్త్రి

ఎక్కడ, పాతికేళ్ల క్రిందటి సంగతి! చంగావి పంచ, పెద్ద పగిడీ భూతమంత్రగాడిలా వచ్చేడు కృష్ణుడి నాన్న. తన కొడుకుని తనతో తీసుకొని పోతానన్నాడు కృష్ణుడి నాన్న. "వద్దయ్యా! పసివాడు, వాణ్ణెందుకు పాడు చేస్తావు? కొంచెం వళ్లు ముదరనీ - ఇప్పుడే ఇక్కణ్ణించి తీసుకెళ్తే బెంగపెట్టుకొంటా"డన్నాడు కృష్ణుడి తాత.

కాని రాఘవయ్య వినిపించుకోలేదు. "ఇంకా ఇక్కడుంటే గొడ్లుకాచుకోడానికి తప్ప మరెందుకూ పనికిరాడు. నా కొడుకు నాదగ్గరే ఉండా"లన్నాడు. తన కొడుకు! ఇన్నాళ్లూ కనపడని తన కొడుకు ఇప్పుడు కావాలి? తను బాగుచేసుకొంటాడు, ఏమిటా బాగు? అథం శుభం ఎరగని కుంటణ్ణి దేశాలంట తిప్పటమే కమా.

అమ్మమ్మ సీతమ్మ కళ్ళల్లో నీళ్లు పెట్టుకొంది. "బాబూ! కిష్టమ్మని ఇప్పటినుంచీ దేశాలు తిప్పకు. వాడేమంత దృఢమయిన వాడు కాడు. పిల్ల పోయిందగ్గర్నుంచీ వాణ్ణి కళ్ళల్లో పెట్టుకొని పెంచుకొంటున్నాను మరో రెండేళ్లుపోతే నా దిక్కడే ఉండమన్నా ఉండడు. ఎవళ్లవస్తువు వాళ్ళదగ్గరే ఉండాలి. ఎవరు కాదంటారు?" అంది.

"అవునమ్మా! మరో రెండేళ్లుపోతే పెళ్ళాన్ని కూడా తెమ్మంటాడు. అదే లాభం" అన్నాడు రాఘవయ్య.

ఆ మొరటుమనిషితో మరి వాదన పెంచుకొందికి భయపడ్డారు, ఆ అగ్రహారిక శ్రోత్రియ దంపతులు.

"మరెందుకూ కేను చెప్పేస్తున్నాను. ఉదయం బండికి తీసుకొని పోతున్నాను" అన్నాడు రాఘవయ్య.

అనుకొన్నంత తేలికగా జరగలేదు రాఘవయ్యకి కొడుకుని తీసుకొని వెళ్లడం. "నాయనా! కిష్టమ్మా! మీ నాన్న వచ్చేడు చూడు" అంది అమ్మమ్మ. అప్పటికి మూడేళ్ళనుంచి తండ్రిచాయ ఎటువంటిదో తెలియని కృష్ణుడికి తండ్రిని చూడగానే భయం వేసింది. "అబ్బా! నాకు నిద్దర వస్తున్నా"దని గోడవంకకు తిరిగిపోయేడు.

ఇంతరాఘవయ్యా దిగివచ్చేడు. "నాయనా! కృష్ణా! ఇటుచూడు, రేపు నాతో వస్తావుకదూ, చూడు, నీ కెలాంటి బట్టలు తెచ్చేనో, ఇవిగో లడ్డూలు, జిలేబీలు, పకోడీలు – ఇంద, తీసుకో నీకే, ఇవన్నీ నీకే" అన్నాడు. ఎందుకో తెలియకుండా ఏడవడం మొదలుపెట్టాడు కృష్ణుడు.

ఉదయం తెల్లవారకుండానే లేచాడు రాఘవయ్య. నిద్రపోతున్న కొడుకు ప్రక్కని కూర్చున్నాడు. ఎలా వదిలేసిపోయానా అనుకొన్నాడు. ఆ నుదురు, ఆ ముక్కు - అంతా శాంతే - నా కొడుకు, నా కొడుకు - శాంత నాకు అప్పజెప్పి వెళ్ళిపోయిందనుకొన్నాడు బాధతో. ఎందుకూ నామీద ఈ పసివాడికింత కోపం? నే నేం చేసేను? ఆ ముసలాడూ ముసలిదీ మతివిరిచేసేరు. లేకపోతే తనంటే ఎందుకింత భయపడతాడు?

ఆ వేళల్లా కొడుకెక్కడ ఆడుకొంటూ ఉంటే, అక్కడే హాజరయాడు రాఘవయ్య! తండ్రి కనబడేసరికి తప్పుకొని పోవడం మొదలుపెట్టేడు. "నా పాడే వాడికి కిట్టకుండా ఉంది." అనుకొన్నాడు రాఘవయ్య. తను మొరటు దేరిపోయాననుకొన్నాడు. ఈ స్థితిలో ఎలా తీసుకొని వెళ్లడం పిల్లవాణ్ణి? శాంత పోయిం తరవాత ఈ గ్రామంతో ఋణం తీరిపోయిందనుకొన్నాడు. ఇప్పుడు మళ్ళీ ఇదేమిటీ బాధ - తాను పోలేడు - ఎలా ఒంటరిగా పోవడం అనుకొన్నాడు. ఆ నిస్సహాయత్వాన్ని భరించలేకపోయాడు.

ఒంటరిగా గదిలోకి పోయాడు. గదిలోకి వెళ్ళేసరికి తంబురా కనబడింది. అనుకోకుండా తీగలమీదికి వెళ్ళేయి వేళ్లు. పూనవానిలో ఉన్నాయి శ్రుతులు. జీవాళీ పెట్టేడు. అనుకోకుండా కళ్లింట నీళ్లు వచ్చేయి. నాలుగేళ్లనాటి ఏడుపు ఒక్కమారుగా పొంగింది. తంబురా! అదే శరణ్యం. తనని లీనం చేసుకొంది తంబురా! మరి తనకి ఏ బాధా తెలియడం లేదు.

గడపలో కూర్చున్నాడు కృష్ణుడు. సంజె వెన్నెలతో పచ్చగన్నేరు పువ్వుల వాసన కలిసిపోయింది. తన చెవికి అత్యంత ప్రియమయిన నాదం వినిపించింది. నాన్న ఎలా ఉన్నాడో అనుకొన్నాడు. తనెందుకు భయపడ్డాడు? ఆ నాదాన్ని వింటూఉంటే తనలో ఏదో ప్రవహించింది. ఆ మృత ప్రాయమైన నాదంలో ఐక్యమయిపోయారు తండ్రీ కొడుకూ. ఆవరణలు దూరమయిపోయాయి. ఇన్నాళ్లు తాను ఎక్కడున్నాడు?

"నాయనా కృష్ణా! వచ్చేవా? నా తండ్రీ వచ్చేవా! నీకేం చేసేను? ఎందుకూ నన్ను వదిలేస్తావు? అంతా నీకోసమే" అన్నాడు రాఘవయ్య. ఇద్దరికీ ఒకటే కన్నీళ్ళు.

"మహిమ తెలియతరమా రామ"...పాడుతున్నాడు రాఘవయ్య "నాయనా! కృష్ణా. పాడమ్మా పాడు. రాముడు నాయనా. రాముడు, అంతా రాముడే. పాడమ్మా పాడు" తను ఎలా పాడేస్తున్నాడో అని కూడా అనిపించలేదు కృష్ణుడికి. అదే మొదటి పాఠం.

ఎన్నో అందామనుకున్నాడు రాఘవయ్య కొడుకుతో. ఏం మాట్లాడ్డానికీ భయపడ్డాడు. తన మాటల్లో అపస్వరాలు పలుకుతాయి కాబోలు. "అమ్మ జ్ఞాపకం ఉందా?" అందామనుకున్నాడు. తనెందుకు అడగడం, జ్ఞాపకం లేకపోతే ఎలా వచ్చేడు తనదగ్గరికి...?

"అప్పుడే తండ్రీ కొడుకు ఏకమయిపోయారూ" అంది అమ్మమ్మ. "ఛే ఛే, ఎక్కడికి పోతుంది. వాళ్లువాళ్లే మనం మనమే, ఎంతచేసినాను" అన్నాడు తాత.

"నాయనా తాతయ్యా! వెళ్ళిపోతున్నా? ఈ ముసలాడు మళ్ళీ నిన్ను చూస్తాడో లేదో?"

ముసలాళ్ళు ఒకళ్లి నొకళ్ళు ఓదార్చుకొంటున్నారు.

మర్నాడుదయం అమ్మవారివనం దాటే

వరికే పొద్దుపొడుస్తున్నాది. మరి ఉదయం బండీ ఆళీలేదు కాబోలనుకొన్నాడు రాఘవయ్య. బయలుదేరే వేళకి మహాలక్ష్మమ్మగారు ఎదురుగా వచ్చేరు. ఆ శుభశకునం తప్పించుకోవాలని లేదు రాఘవయ్యకి. ఎలా అయినా పట్నం చేరుకోవాలనే ఉంది. ఎంత మహా, ఆరుమైళ్ళుంటుంది. ఇక్కడున్న పట్నం. కొంచెం అడుగు వేగం పడితే ఉదయం బండికే అందిపోవచ్చును.

విశ్వనాధరాజుగారి తోట మలుపు తిరిగిపోతున్నారు తండ్రి కొడుకులు – తోట పెండి నిండా ములుగోరింట పువ్వులు బంగారపు పువ్వుల్లా ఉన్నాయి. వాటి పచ్చదనంతోనూ, విలువతోనూ రాఘవయ్యకి పనిలేదు. తాత దేవతార్చనకి పువ్వులకోసం రోజూ ఆ తోటకి వచ్చేవాడు కృష్ణుడు. ఆ పువ్వులు అలా చెట్లనే వాడిపోతాయి. వాటికీవాళ దైవపూజార్హత లేదు కాబోలు. ఓ రెండు పువ్వులు కోసేడు. వాటికి వాసనా లేదు. అయినా దేవుడికి మాత్రం అవే ప్రీతిట! తాత చెప్పేడు. అప్పటికే రాఘవయ్య పాతిక గజాల దూరంలో ఉన్నాడు. ఒక్కమారు వెనక్కి చూసి, తాపీగా నడుస్తున్నాడు.

దూరాన ఎక్కడో భూకాంత పిట్ట అరుస్తూంది. ఎంత బాధో దానికి! అది ఏడవడాన్నికే పుట్టిందిట! ఎవళ్ళేం చెయ్యగలరు? చేతులారా చంపుకొంది కన్నకూతుర్ని. ఎన్ని జన్మ లేడవాలో? రోజూ భూకాంత పిట్టతో తనూ అనేవాడు. "భూకాంత—నా కూతురు – ఇప్ప పువ్వు" అని. ఈవాళ గట్టిగా అనలేదు. మనసులో మాత్రం అనుకొన్నాడు.

ఏకాంబిరించి రాజిగాడి పాట వినిపిస్తున్నాది. "చుక్క చుక్కల నేడీ, సింగారపు లేడీ" అని పాడుతున్నాడు రాజిగాడు. ఈవాళ కృష్ణుడి వేషం వింతగా కనిపించింది రాజిగాడికి.

"ఏటి చిట్టి బుగతా! ఎక్కడికి ప్రయాణం కట్టినా"వన్నాడు – రాజిగాడు. "మా నాన్నతో పట్నం వెళ్తున్నానురా" అన్నాడు కృష్ణుడు ధీమాగా.

"మళ్ళి ఎప్పుడొస్తావండీ?" అడిగేడు రాజిగాడు.

"ఏమో?" అన్నాడు కృష్ణుడు.

"అయితే చిట్టి బుగతా! చెరుకు గానుగలకుండవా? నూర్పుల కళ్ళాలకి రావా? ఏటయ్యా ములిగిపోతంది? మరో పదిరోజులకి మన లక్కావు ఈనుతుంది. పండుగ ముందే వెళ్ళిపోతున్నావు" అన్నాడు రాజిగాడు.

అవును నిజమే, తను ఎందుకు వెళ్ళిపోతున్నాడు? తన కాళ్ళు తన స్వాధీనంలో లేనట్టు తట్టింది కృష్ణుడికి. "అరుగో మా నాన్న. వెళ్ళిపోతున్నారు" అన్నాడు. రాఘవయ్య వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోతున్నాడు. అతనికి చాలా చికాగ్గా ఉంది. రెండురోజులనుండీ అతనికి బ్రహ్మపదార్థం కళ్ళకి కనబడలేదు. ఇక, కొడుకు గురించి మరే ఆలోచనా లేదతనికి. ఏదో ముక్తాయి గొణుక్కుంటూ సాగిపోతున్నాడు.

కృష్ణుడికి మళ్లీ ములుగోరింట పువ్వులు సాక్షాత్కరించేయి. "ఓరే, రాజిగా! ఇవాళ తాత దేవతార్చనకి పువ్వులు లేవురా. రాజుగారితోట పెండిని చాలా పువ్వులున్నాయి. నువ్వు కోసి, తీసికొని వెళ్లు!" అన్నాడు. రాజిగాడు వినిపించుకోలేదు. "అయితే చిట్టి బుగతా! ఇప్పుడప్పుడే రావా? నువ్వు గొప్పోడివయిపోతావు. అప్పుడు మేం కనబడతామా?" అన్నాడు రాజిగాడు నవ్వుతూ.

"పోరా! నువ్వెప్పుడూ కోస్యాలే ఆడతావు" అన్నాడు కృష్ణుడు.

రాఘవయ్యకీ నడక చాలా బాధగా ఉంది. కుఱ్ఱవాడితో నడక సాగడం లేదు. ఇక ఉదయపు ట్రెయిను ఆశ కూడా లేదు. ఏదో నెమ్మదిగా పట్నం చేరుకొంటే చాలు ననిపిస్తున్నాది. అడ్డుతోవనుండి ఏదో బండి వస్తున్నాది. బయలు దేరిన వేళ మంచిదే. "ఏం నాయుడూ! పట్నమే వెళ్తుందా బండీ" అన్నాడు రాఘవయ్య.

బండినాయుడు బాగా ముసలివాడు. పొట్టిగా లావుగా ఉన్నాడు. నల్లగా వడిలిపోయిన రంగు, పెద్ద పండు మీసాలు. మొహంనిండా పట్టెనామాలు, వెనక్కి పండుజుత్తు సిగ.

"అలాగేను నాన్నా! పట్టమే బయలుదేరినాను. నువ్వు పట్టమొస్తున్నావా?" అన్నాడు నాయుడు. దూరంనుంచి కృష్ణుడు వస్తున్నాడు. మొగం కందగడ్డలా అయిపోయింది. వరాయి అలవాటులేక కాళ్లు తడబడుతున్నాయి. "అన్నా! పిల్లడు కూరాకునాగ వాడిపోనాడు రా, నాయనా, రా!" అన్నాడు నాయుడు.

బండి చిన్న కుదుపుతో నడుస్తున్నాది. రాఘవయ్యకి కృతజ్ఞత ప్రకటించాలనే ఉంది. "అయితే తాతా! ఎవరికేమిటి బండీ తీసుకొని వెళ్తున్నా"వన్నాడు.

నాయుడిందుకొన్నాడు. "ఇదిగో బాబూ! పట్టంనించి మా చిన్నబుగతి వస్తున్నాడు కొల్లికి. బండీ తీసుకెళ్లకపోతే రాగలడా? చదువుకున్న మారాజు, రోజూ కోర్టుకెళ్ళడానికే సుఖబ్బండి కావాలికదా! ఆమాటకివస్తే మా పెద్దబుగత సంగతి చెప్పండి, ఓబండీ అక్కర్నేదు, బక్కు అక్కర్నేదు. బురదా బాడీ అనకుండా పదికోసులు నడిచివోడు. మాతో సమంగా పొలం పని చేసేవోడు. ఏకాళీఉపాసంతో కూడా పట్టం నుంచి బయలెళ్ళేవోడు పొలాలు చూడ్డానికి. అలాగే కష్టపడ్డాడు, అలాగే ఆర్జించినాడు. లక్ష్మీ పొంగాలంటే అంతేనాయనా! మా ధర్మప్రభువు! ఎక్కడో పెత్తండ్రి కొడుక్కి తనతో సమంగా వాటా ఇచ్చినాడు. ఏదీ, సెంటు భూమి మిగుల్చుకోగలిగినాడా! అనకూడదు బాబూ! వందల్లక్ష్మి! ఆ వేళ కలాటిబుద్ధులే పుడతాయి. తాగి తందనాలాడితే ఆస్తులు నిలబడతాయా? ఏం నాయనా!" అన్నాడు నాయుడు. "కాదా, మరి" అన్నాడు రాఘవయ్య సహీ చేస్తాను.

రాఘవయ్యకి కునికిపాట్లు వస్తున్నాయి. కృష్ణుడికి బండి తోలాలని బుద్ధి పుట్టింది. దారి సాఫుగా నే ఉంది. "తాతా! నా చేతికోరడా ఇద్దూ, నేను తోలుతాను" అన్నాడు కృష్ణుడు.

"ఓహో చిట్టి బుగతగారికి బండితోలడం వచ్చునేటి? రండి మొత్తాలమీదికి. గట్టిగా మాత్రం కొట్టకండి. వెళ్ళినంత సేపటికి వెళ్తాయి, ఏటి తొందర అన్నాడు నాయుడు. అతగాడికి బాతాఖానీ వదిలాలని లేదు— "ఏది బాబూ! ఓ చుట్టముక్క ఇలా పడీమీ!" అన్నాడు రాఘవయ్యతో – రాఘవయ్య నీరసపు నిద్రకి బండి కుదుపు, బాతాఖానీ పథ్యంగానే ఉన్నాయి. మధ్యమధ్య నాయుడి ప్రశ్నలు లేకుండా ఉంటే చాలును. "అయితే నాయుడూ! నీకు స్వంత వ్యవసాయం కూడా ఉందా? లేకపోతే అంతా కౌలుకేనా?" అని కదిపి వదిలేసేడు రాఘవయ్య. నాయుడు మొగంలో ఆనందం తొణికిసలాడింది. చుట్ట ముట్టించేడు. నిదానంగా మొదలు పెట్టేడు.

"ఉంది నాయనా! ఉంది, ఓ అయిదు గరిశలకి అవుద్ది. ఓ అయిదు గరిశలకి కౌలుకి చేస్తున్నాను. మరి చెయ్యలేను నాయనా! నా భూమే అమిర్చిదా మనుకుంటున్నాను.

ఓ నాలుగాళ్ల పశువులూ, ఇల్లూ వాకిలీ అంతా ఉందిబాబూ! ఇదిగో కోడలు పిల్ల మొన్ననే ఎదిగింది. పండుగపోతే తీసుకొద్దామనుకుంటున్నది నాయిరాలు. ఇక ఎన్నాళ్లు బాబూ! బతికినన్నాళ్ళు బతుకుతానా? అంతా ఆ పరాత్పరుడికరుణ! ఏటంటావు నాయనా! నేను నడుం కట్టే సరికి, మా అయ్య ఏడుపశువులూ, నాలుగకరాల పొలం అప్పజెప్పినాడు. "బుగతగారి పాదులు పట్టుకొని సేవచేసుకోరా ఎదవా" అన్నాడు. తనదారిని తను పోయినాడు. నాటినుంచి నాబాధ నేనే పడుతున్నాను బాబూ! తిన్ననాడు తిన్నాం; లేనినాడు లేదు. మా అమ్మికి పెళ్లిచేసినాను. ఆరు తులాలు బంగారం పెట్టినాను. దాని కోవా పెరిగింది. పెద్దినాయిరాలికి సంతానం కలిగింది కాదు. "ఏటిమావాఁ ఎన్నాళ్లిలాఉంటావు. మనం ముసలాళ్ళం అయిపోతన్నాం. నీ కడుపునో కాయ కాస్తే నాదిమాత్రం కాదా?" అంది. తన పట్టుపట్టి సవితిని తెచ్చుకొంది. దానిబుద్ధి మంచిది. దానికోరి కీడేరింది. చిన్ననాయిరాలు పిల్లణ్ణెత్తింది. వాడూ సిరిగలగుంటవో, వాడు పుట్టినతరవాత పదెకరాల భూమి కొన్నాను, పశువుల్ని కొన్నాను. నాయిరాళ్ళఒంటిమీద బంగారం చేయించినాను. ఇల్లూ వాకిలీ అంతా సమస్తమూ వాడి పేరు బలిమి నేబాబూ! పెట్టి పుట్టినాడు మళ్లా తెచ్చుకున్నాడు తనతోనే - ఏటి శాశ్వతం నాయనా! పేరే ఉండిపోతాది. ఎంతున్నా ఉన్నదే. ఆకొక్కడికి. నా ఎక్కచ్చిగా రామమందిరం కట్టించినాను; ఎకరంభూమి రాసినాను. మనమేటిచెయ్యగలం నాన్నా! కొండంతదేముడికి కొండంతపత్రి తేగలమా? అంతా ఆ రాముడి కరుణ. అండపిండ బ్రహ్మాండాలు తనలోనే పెట్టుకొన్నాడు. తనే ఆడిస్తున్నాడు, అంతా ఆడుతున్నారు; తనే నవ్విస్తన్నాడు, ఏడిపిస్తన్నాడు. మనచేతిలో ఏటుంది తండ్రీ!" రాఘవయ్యకి నిద్ర తేలిపోయింది - లేచికూర్చొన్నాడు. చెరువుగట్టుమీద బండి నడుస్తున్నది. మరొక మైలుంటుంది పట్నం.

దూరంగా చెట్లసందుల్లోంచి కనపడుతున్నాది రాజాగారికోట. కోట బురుజు మీద జెండా ఎగురుతున్నాది, ఇంకా ఉన్నానంటూ!

కృష్ణుడంతవరకూ పట్నం రాలేదు. పట్నానికో రాజాగారుంటారనిమాత్రం తెలుసును. "తాతా! ఏమిటదీ?" అని అడిగాడు.

"మారాజుకోట. తెలియదా చిట్టిబుగతా?" అన్నాడు తాత.

చూసినప్పుడే అనుకొన్నాడు రాజాగారి కోటే అయి ఉంటుందని. ఈ రాజాగారికి లేక లేక సంతనమే కలిగిందో, ఏడుగురు కొడుకులూ చేపలు పడుతున్నారో? రాజకుమారుడికి తోడు మంత్రికుమారుడున్నాడో లేడో? అయినా పేదరాసి పెద్దమ్మ, ఆయవారపు బ్రాహ్మడూ లేకపోతే ఎలాగ?

కోటభోగట్టా ఊరుకోనివ్వలేదు తాతని రాఘవయ్యకూడా మరో ఆలోచన పాలు పోకవింటున్నాడు, వంట్లో నీరసంగా మాత్రం ఉంది. ప్రారంభించాడు తాత - "ఏటికోట? ఏటి మారాజులు నాన్నా! అంతా కొంపల్ని కొట్టి గద్దలకి వెయ్యడం, అయినవాళ్ళ కొంపల్లోనీ, కానివాళ్ళకి కంచాల్లోనీని" కొత్తరాజుగారు సత్రములు తీయించడం తాతకి చాలా అరుచి కరమయిన విషయం.

"ఏటి తరిగిపోతుంది బాబూ! సత్రవులు తీయించడం, గుళ్లు తిరగదోయించడం, ఏటి మహాగొప్ప ఘనకారియం? పెద్దలు పెట్టినవి మనం తీసేస్తేనే గొప్పవాళ్ళమా?

"మొన్ననో పంతులొచ్చినాడు నాయనా! "నాయుడూ కోవెల కట్టించకపోతే పట్నంలో హైస్కూలు కట్టిస్తున్నారు. చందా ఇవ్వలేకపోయినావా?" అన్నాడు. "బాబూ కోవెలకట్టిస్తే పుణ్యం అన్నారు పెద్దలు. ఎంత రోజులుమారిపోయినా పుణ్యం పాపం పోదుకదా! పోనీ మా పిల్లడి చేత కాలేజీలే కట్టిస్తారో, బీదల సంతర్పణలే చేయిస్తారో చేయించండి"న్నాను.

"బాబూ! పెద్దరాజుగారిని చూసినావా? ఏదీ, మొన్నటి పిల్లడివి, నీకేటి తెలుస్తాది? నేనుమాత్రం ఒకపరాయం చూసినాను పెద్దమ్మాయిగారి పెళ్లికి. అలాటిపెళ్ళి మళ్ళీ చూస్తామా బాబూ! పెద్దమారాజు సాయంగా కాసులు పంచిపెట్టినాడు తేమ్మర్లకి. పట్టపట్టం పసిపిల్ల బాలాద్రీ కోటలోనే ఉండిపోయినారు పెళ్లి అయిదు రోజులూను. ఆరోజులే వేరునాన్నా! ఇప్పుడిదంతా ఇదోతీరు. పెద్దల ఆస్తిమాత్రం కావాలి, పెద్దల మరియాద అక్కర్లేదు. నాయన దేవుడికి కోవెలకట్టిస్తే నువ్వు పేకాటకి కబ్బు కట్టించినావు? తేమ్మర్లకి సత్తరవు కట్టిస్తే, నువ్వు కుక్కలకి విందు చేస్తున్నావు? పూర్వం నాయన అడవికి వేటకి వెళితే, నువ్వు కోటలోనే పెద్దపులుల్ని సింహాల్ని పెంచుతున్నావు? ఏది నీ తెలివి? ఇప్పుడు కోటనిండా పుల్లూ సింహాలూ నాయనా! వాటికి రోజూ గొర్రెపోతులు ... యేటి చెప్పమంటావు నాయనా! మన కెందుకులే నాయనా! ఏ చెట్టు కగ్గంటే ఆ చెట్టు కాలిపోతది."

ఊరు చేరేసరికి పదిగంటలయింది. "తాతా! మరి నేను వెళతాను! నువ్వుం-" అన్నాడు రాఘవయ్య కొడుకుని బండి దింపుతూను. "ఇందచుట్టముక్కలు కొనుక్కో" అని ఒక అర్ధరూపాయిచ్చేడు. తాతకి బ్రహ్మానందమయిపోయింది. "నాయన నాయన! ఎక్కడనుంచివస్తున్నావుబాబూ" అన్నాడు. "నేనా? అగ్రహారం నుండి వస్తున్నాను. శాస్త్రులుగారి అల్లుణ్ణి" అన్నాడు రాఘవయ్య.

"శాస్త్రులుబాబు అల్లుడివా నాయనా! ఆ సంగీతం బాబువా? ఎలా అయిపోయావు తండ్రీ! నిన్ను పోల్చకో లేకపోయాను" అన్నాడు తాత. రాఘవయ్య తొందరపడుతున్నాడు. "మరికలవుబాబూ! చిట్టిబుగతా! వుంటాను" అన్నాడు తాత.

సాయంత్రం అయిదుగంటలకిగాని మరి రైలు లేదు. సత్రవులో బసచేశాడు తండ్రీ

(8-వ పేజీ చూడండి)



అమెరికన్ పారిశ్రామిక వస్తుప్రదర్శనమందిరం.

# భారతీయ పారిశ్రామిక ప్రదర్శనము

అక్టోబరు 29 వ తేదీన మన ప్రధానమంత్రి పండిట్ నెహ్రూ ఢిల్లీలో పారిశ్రామిక ప్రదర్శనానికి ప్రారంభోత్సవం చేశారు. ఈ ప్రదర్శనంలో వివిధ దేశాల పారిశ్రామిక వస్తుసంపద ప్రదర్శింప బడుతోంది. దీనివల్ల అంతర్జాతీయ వాణిజ్యానికి దోహదం కలుగుతుంది.

భారత దేశం ఏర్పాటుచేసిన బ్రహ్మాండమయిన ఈ ప్రదర్శనం ఆసియా ఖండంలో ప్రప్రథమ మయినది. ఢిల్లీ — మథురా రోడ్డుప్రక్క బీడుపడ్డ భూమిమీద 75 ఎకరాల పారిశ్రామికనగరం నిర్మింపబడింది 29 వ తారీఖున ప్రారంభోత్సవానికి వీలుగా ఈ కట్టడాలు పూర్తిచెయ్యడానికి రాత్రింబగళ్లు విరామం



పోలిష్ పారిశ్రామిక వస్తుప్రదర్శనమందిరం.




అమెరికన్ మందిరం మోడల్.



త్రివర్ణపతాక చిహ్నాలతో భారతీయ పారిశ్రామిక వస్తుప్రదర్శన మందిరం.



చైనీస్ మందిరం.

లేకుండా కార్మికులు ఇంజినీర్లు పాటు పడ్డారు. ఈ ఉత్సవంలో అనేక దేశాలు తమ తమ పారిశ్రామిక వస్తు సంపదలను ప్రదర్శనానికి, వ్యాపారానికి తెస్తున్నారు. ఈ సామగ్రి అంతా ప్రదర్శించుటకు 400 స్టాల్సు నిర్మింపబడ్డాయి. 20 మందిరాలలో, ఇంతమటుకు, రష్యా, అమెరికా, ఇంగ్లండు, చైనా, చెకోస్లోవేకియా, హాలండు మున్నగువారి కట్టడాలు ఉన్నాయి.

భారతదేశం తక్కిన రంగాలలో చేసిన కృషి, కలిగించిన ప్రోత్సాహం విజయవంతములయినట్లే, అంతర్జాతీయ వాణిజ్యరంగంలో కూడా చేస్తున్న కృషి తప్పక సఫలమవుతుంది.

ఫోటోలు : త్రైలోకిచంద్ర ప్రభు

చెకోస్లోవేకియా భారీపరిశ్రమలు కట్ గ్లాస్ పరిశ్రమల ప్రదర్శనానికి అమర్చిన మందిరం.



కొడుకులు. స్నానం చేసుకొని, భోగయ్య గారి హోటలుకి కొడుకుని తీసుకొని వెళ్లేడు రాఘవయ్య! ఇంకా హోటల్లో దేవతార్చన పూర్తి కాలేదు.

"బాబూ వెళ్లిపోకండి, అయిపోయింది; ఇవాళ పనసకాయ కొడుతూ వుండిపోయాను. ఆలస్యం అయిపోయింది" అని కేక వేసేడు భోగయ్యపంతులు. మరో పావుగంటలో దేవతార్చన ముగించి, హస్తోదకం యిచ్చుకున్నాడు భోగయ్యపంతులు రాఘవయ్యకి.

ఏదో చెప్పుకొనిపోతున్నాడు భోగయ్య పంతులు. స్నానం చేసి, భోజనానికి ఉపక్రమించడంతో కొంత తేరుకున్నాడు రాఘవయ్య. భోగయ్యపంతుల్ని కదిలించాలని, "భోగయ్యబాబూ, ఇవాళ పనసకాయ యేమిటె, దేదీప్యమానంగా వుంద"న్నాడు.

భోగయ్యగారైనా అంత నోరుకట్టుకునే మనిషి కాదు. ఆయనదగ్గర పనసకాయకూరకి సంబంధించిన తరతరాల ఇతిహాసాలెన్నో వున్నాయి. అందుకున్నాడు భోగయ్య పంతులు.

"బాబూ! అది అసలు పనసకాయ. దానిని ఎలాటివాళ్లు పోపులో వేసేసినా రుచిగానే ఉంటుం"దన్నాడు, ఉపోద్ఘాతంగా. సంగీతజ్ఞుడు రాఘవయ్యకి సాధకంలో ఉండే విశ్వాసం అనంతం.

"అహాఁ అదేమన్నమాట? అందరూ పాడేస్తేఎంతబాగుంటుందో, అందరూ పోపు వేసేసినా అంతేబాగుంటుంద"న్నాడు.

సరియైన శ్రోత దొరికాడు. ఇక మరి బాధలేదు. భోగయ్యపంతులు విజృంభించ వచ్చును.

ఈమధ్య తనకి అనుమానంగా ఉంది, అల్లరివెధవలు "భోగయ్య ఎప్పుడూ తన గొప్పే చెప్పుకొంటాడురా" అంటున్నారు. ఈయన తనుమనిషే-యదార్థవాది కూడాను.

"అయితే నాయనా! ఒక్కమాటంటాను కోపపడవుకదా? అసలు, పనసకాయ కొట్టడం అంటూ వచ్చునూ ఎవడికేనా యీ రోజుల్లో? కొట్టడందాకా ఎందుకు, లేత కాయ ఎలావండాలో, ముదరుకాయ ఎలా వండాలో, కజ్జాకాయ ఎలావండాలో తెలిసినవాడొక్కడున్నాడూ? అలాగే వండేస్తున్నారు, అలానే తినేస్తున్నారు. అడుగో ఆ ద్రాపివెధవ! నిన్న సాయంత్రం కొట్టడం ప్రారంభిస్తాడు, ఇవాళ ఒంటిగంటదాకా "చెక్ చెక్, పనస చెక్" అని అమ్ముతూనే ఉంటాడు ఆవెధవ చెక్క. గంటకి రెండుకాయలు కొట్టి పారేస్తాడు. అది నాలికలో తాటిపత్తెలో! అలాగే కోసేస్తున్నారు, అలానే మింగేస్తున్నారు." రాఘవయ్యకి ధోరణి మంచి ఆనికగానే ఉంది. "అవునవునంతే" అన్నాడు నవ్వుతూను.

భోగయ్యగారికి మళ్ళీ పూనకంవచ్చింది.

"దాన్ని చెయ్యవలసినట్టుగానే చెయ్యాలి. మంచి దోరకాయ తేవాలి. ఈవాళకూర యీవాళే తెచ్చుకోవాలి. చక్కగా మంచి దారైనకత్తికి మొదటే నూనెరాయాలి. ఇదిగో ఇలా జీలకర్ర పాయలలాగే కొట్టాలి. అలాగని మళ్ళీ ముద్దయిపోకూడదు. ఇక రెండుగంటల సేపయినా నేనూ అనితంటాలు పడాలి. ఆతరవాతమాటా, ఆవాపులుసే పెడతావో, పప్పులోనే పడేస్తావో, నీయిష్టంవచ్చినట్టు చెయ్యి, సవాలక్ష వంటలు- పనసకాయ ఎలామాత్రం చెయ్యబడదు గనకా?"

కృష్ణుడికిదంతా ఏదో చిత్రంగాఉంది. ఎందుకీ బ్రాహ్మడిలా ఆవేదన పడిపోతున్నాడో తెలియకుండా ఉంది. తన భోజనం అయిపోయింది. లేచిపోతాడేమోనని "కూర్చో! నేనూ వచ్చేస్తున్నాను" అన్నాడు రాఘవయ్య.

భోగయ్యగారి హోటల్లో అంతా ఒక్కమారే లేవాలి. అది అక్కడి సంప్రదాయం. రాఘవయ్య భోజనం అయిపోవస్తున్నది. భోగయ్యపంతులు సంగ్రహంగా చెప్పుకుని పోతున్నాడు.

"ఒకమారు డిప్టీకలెక్టరు కృష్ణమూర్తి పంతులుగారు వచ్చారు. ఊళ్ళో బంధువులు మల్లాప్రగడవారున్నారు. అక్కడికి వెళ్ళలేదు. "భోగయ్య పంతులూ! అంతా అంటున్నారు. ఇవాళ నీచేతిపాకం చూద్దామని వచ్చేన"న్నారు. ఆవేళ అదృష్టం బాగుంది. ఆయన రావడమూ పనసకాయ రావడమూ ఒక్కమారే జరిగేయి. ఆవేళ ఏమీ లేదు. పప్పువేసి కాబోలు వండేను, వట్టి వడియాలూ ఇంగువా పోపుపెట్టేను. "టైములేదు. మళ్ళా కేంపుంది. వేగం కానియ్య" అన్నారు. కూర బాగా ఉడికిందో లేదోనని భయపడ్డాను. ఆవేళ భోజనం అంతా కూరతోనే పూర్తిచేశాడు మహారాజు. మొన్న కూతురు బాలమ్మకి పెళ్ళిచేశాడు. మా సత్తెప్ప (సత్యనారాయణ) వంటకివెళ్తే అంటాట్ట-"పనసకాయ భోగయ్య పంతులు దేనయ్యా! మరొకళ్లు పనసకాయ వండకూడదు" అని. చాలదూ? ఇంతకీ నాయనా! ఒక్కొక్క వేళా విశేషమూ, తినేవాళ్ళ అదృష్టమూను."

రాఘవయ్య భోజనం అయిపోయింది. లేచి డబ్బులు ఇవ్వబోయాడు. భోగయ్య పంతులు అతని రెండుచేతులూ పట్టుకొన్నాడు. "నాయనా! ఏ సంచితకర్మమో హోటేలు పెట్టుకొన్నాను. అన్నం అమ్ముకొంటున్నాను. మా తాత జటాంత స్వాధ్యాయి, మా నాయనగారూ యజ్ఞం చేసేరు. రామనారాయణపురం పద్దెనిమిది విర్తుల అగ్రహారం మాది, అన్నీ అంతరించిపోయాయి. నేనిలా అయిపోయాను. ఏమనుకొని ఏం లాభం నాయనా? రోజూ హోటల్‌కి వచ్చిన ఇద్దరు బ్రాహ్మలకి హస్తోదకం ఇచ్చుకొంటున్నాను, ఇప్పటికి ఇరవైయేళ్ళనుంచీన్నీ. నేను వేలూ లక్షలూ ఆర్జించనక్కరలేదు. ఈ జీవితం ఇలా సాగిపోనీ, కర్మశేషం ఇలా హరించిపోనీ!"

రాఘవయ్యకేమి అనడానికి తోచలేదు "అన్నదాతా సుఖీభవ" అని తేన్చి," "భోగయ్య బాబూ! శలవు తీసుకుంటానన్నాడు రాఘవయ్య! "శుభం శుభం నాయనా! వచ్చినప్పుడల్లా ఇక్కడికే వచ్చేస్తూఉండు" అన్నాడు భోగయ్య పంతులు.

సత్రవు అరుగుమీద కొడుకుని కూర్చోమని ఎక్కడికో వెళ్ళిపోయేడు రాఘవయ్య. పట్నవాసపు దృశ్యాలన్నీ ఒక్కమారుగా ఆ పసికళ్ల అమాయకపు పసి హృదయాన్ని చిలుకుతున్నాయి. కిల్లీకొట్టు పాపమ్మ ఎవణ్ణో గట్టిగా దుయ్యబట్టుకుంది. అది నిద్రా కాదు, అలసటా కాదు, ఏదో దిగులు.

తాత ఈసరికి భోజనం చేస్తూఉంటాడనుకొన్నాడు. ఏదో భూతం తనని తెలియని లోకంలో అమాంతంగా పడేసి వెళ్ళిపోయినట్టనిపించింది. ఎవరీ నాన్న? ఎందుకు వచ్చేశాడు తనూ? తాత, అమ్మమ్మ తనని ఎందుకు వదిలేశారు?

బస్సులు వెళ్ళిపోతున్నాయి, సైకిళ్ళు జట్కాలు మనుష్యులూ ప్రవాహంలాగ సాగిపోతున్నారు. ఒకమారు చూసిన మొగం మరునిమిషానికి కనిపించకుండా ఉంది. అందరూ వళ్ళు తెలియకుండా ఎటో కొట్టుకొని పోతున్నట్టున్నారు.

నాలుగు గంటలకి బండీ తీసుకొనివచ్చేడు రాఘవయ్య. ఉదయం రాఘవయ్య కాదిప్పుడు. చెవులకి కమలాలు, చేతులకి మురుగులు, వేళ్ళకి ధగధగలాడే ఉంగరాలూ పెట్టుకొన్నాడు. సెలంవోణీ వేసుకొన్నాడు.

"లేవోయి, వెధవాయీ! లే! ఎక్కు బండీ ఎక్కు, తాత! వెధవతాత ఉడతలాగ బుర్ర పెట్టుకొని, ఏమి ఇంకా అక్కడే ఉన్నావు" అని రెండు రెక్కలూ పట్టుకొని బండిలో కూలదోశాడు. ★

## సీరియల్:




### వా. స. మూర్తి

ఆవేళ కమలకు కొంచెం ప్రొద్దెక్కితే కాని మెలకువ రాలేదు. మెలకువ వచ్చిన తరువాత కూడా బద్ధకం మూలాన కొన్ని క్షణాలు అలాగే కదలకుండా ఇంటి కప్పుకేసి చూస్తూ పడుకుంది. వెంటనే ఒక విషయం జ్ఞాపకం వచ్చి ఎగిరి కూర్చుంది. పరీక్షాఫలితాలు తేలేది ఆవేళే. అది తలచుకోగానే ఆమె గుండె ఒకక్షణం ఆగి మళ్ళీ వేగంగా కొట్టుకోసాగింది. పరీక్ష ఏమైందో! పేపర్లో తన నంబరు ఉంటుందో ఉండదో! గుండె దడ ఆపుకుందుకన్నట్లుగా రొమ్ము మీద చేయి పెట్టుకొని అలాగే కూర్చుంది కమల. ఇంతలో దొడ్లోనుంచి పిల్లల ఏడుపు వినిపించింది. వదినగారు చంటిపిల్లను కొడుతున్నట్లుంది. ఆమె కేక కూడా వినిపించింది: "ఆ రాణీగారు అప్పుడే లేస్తారేమిటి? చేసేవాళ్లుంటే నేనూ పందిరిమంచం దిగక పోదును. ఇంతకీ దేనికైనా పెట్టిపుట్టాలి!"

కమల ఉలిక్కిపడి కిటికీవైపు చూసింది. నిజంగానే బాగా ప్రొద్దెక్కిపోయింది. కంగారుగా లేచి దొడ్లోకి పరుగెత్తింది.

"ఏమమ్మా, ఇప్పటికైనా తెల్లవారిందా నీకు," అని అడిగింది సూర్యకాంతం మొగం చిట్లించుకొని.

"కాదు వదినా, ఈవేళే పేపర్లో మా పరీక్షల సంగతి పడుతుందికదూ. ఆ ఆదుర్దాతో రాత్రి నాకు సరిగా నిద్ర పట్టనే లేదు. తెల్లవారబోయేముందే కాస్త కునుకు పట్టింది. అందువల్లే పొద్దు తెలియలేదు, వదినా" అంది కమల. వదినగారు ఏడుస్తున్న చంటిపిల్లకు జడవేయడం పూర్తిచేసి అవతలకు తోసి, తనజుట్టు దువ్వుకుంటూ చిక్కుతీసి కాలివేలికి చుట్టుతోంది. ఏమీ మాట్లాడలేదు.

కమల పళ్లపొడి తీసుకొని గబగబా పళ్లు తోముకొని మొగం కడుగుకొని వచ్చింది. "పేపరు పదిగంటలకు వస్తుంది వదినా. ఏమవుతుందో! నా నంబరు ఉంటుందో ఉండదో! చాలా భయంగా ఉంది, వదినా" అంది వదినగారి దగ్గరికి వస్తూ.

"నీకేమమ్మా, తప్పితే మరోసారి కూర్చుంటానంటావు పరీక్షకి. అయ్యేది ఖర్చు ఆయనకి. ఇప్పటికే బోలెడు డబ్బు తగలేశారు" అంది వదినగారు బుంగమూతి చేసుకొని తనమంట జుట్టుమీద చూపించుకుంటూ.

వదినగారి మాటలకు కమలమనస్సు చివుక్కుమంది. అసలే గుండె అదరిపడుతోంది. కొంచెం ధైర్యమిచ్చేమాటలంటే ఎంత బాగుండును! కాని ఇలా అపశకునంగా మాట్లాడడమేమిటి? వదినగారి కోరకోర స్వభావం ఆమెకు తెలియనిది కాదు. కాని ఆవేళకూడా అలాగే మాట్లాడడం ఆమెకు చాలా బాధ కలిగించింది. తనను సమర్థించుకుంటూ అంది: "నేను బాగానే వ్రాశాను, వదినా. న్యాయంగా పాసవాలి. కాని పేపరు వచ్చేవరకూ ఆదుర్దా తప్పదు. ఎవరో వెంటనే చెప్పివేస్తే బాగుండును నేను పాసయ్యానని - గుండె తేలికపడిపోతుంది!"

సూర్యకాంతం దువ్వెన బొట్టుపెట్టెలో పెట్టి, కాలివ్రేలికి చుట్టుకున్న చిక్కు తీస్తూ లేచింది. విసుగుగా అంది: "సరే అప్పుడే జామున్నర పొద్దెక్కింది. ఇప్పటికైనా ఆ పిల్లలకు కాస్త నీళ్ళూ అవీ పోసి, అన్నాలు పెట్టి బడికి పంపిస్తావా, అవీ నేనే చూసుకోవాలా? అన్నిటికీ నేనున్నానుగా మరి. నాకూ నీలా గారాబంచేసే అన్నగారుంటే నేనూ నేలమీద అడుగు పెట్టక పోదును." అలాగే మూతి ముడుచుకొని బొట్టుపెట్టె తీసుకొని లోపలికి వెళ్లిపోయింది.

కమల దొడ్లోకి వెళ్ళి పిల్లలందరినీ పిలిచి, నీళ్లుపోసి, బట్టలుతొడిగి అన్నాలు పెట్టింది. ఈ పనులన్నీ చేస్తున్నా ఆమె మనస్సంతా కొద్దిసేపటిలో వచ్చే పరీక్షా ఫలితాలమీదే ఉంది. పిల్లలందరూ - చంటిపిల్లతప్ప - బడికి వెళ్లిపోయారు. కమల చంటిపిల్ల బుచ్చిని పిలిచి ఆమె ముందు చేతివ్రేళ్ళు రెండు చాపి ఏదో వొకటి పట్టుకోమంది. బుచ్చి రెండు వేళ్ళూ పట్టుకుంది. "కాదు, ఏదో ఒకటే పట్టుకోవే" అంటే ఆమె అనుకొని వ్రేలు పట్టుకుంది. దానితో అనుమానం మరింత యెక్కువైంది. "ఆఁ, పిల్లపట్టుకున్నంతలో ఏమవుతుంది" అని సముదాయించుకోబోయింది. కాని ధైర్యం చిక్కడంలేదు. ఏమో నిజంగానే నంబరు లేదేమో! అలా ఆందోళన పడుతూనే త్వరగా స్నానంచేసి బట్టలు వేసుకొని వీధిలోకి వచ్చి చూడసాగింది. ముందురోజు సాయంత్రమే యెదురింటివాళ్ల పిల్లవాడికి చెప్పియిచ్చింది పేపరుకోసం. పేపరు రాగానే తిన్నగా స్టేషను నుంచే తీసుకువస్తానన్నాడు ఆ కుర్రవాడు. ఈపాటికి వెళ్ళేవుంటాడు. అయినా కనుక్కుందామని వెళ్ళి యెదురింటివాళ్ల నడిగింది. కుర్రవాడు వెళ్ళాడని చెప్పారు. వాళ్ళతో కొంచెంసేపు కబుర్లుచెప్పవచ్చింది. గడియారం చూసింది. ఎనిమిదిన్నరఅయింది. ఇంకా సుమారు గంటన్నర వుంది. ఇంతసేపూ గడపడం ఎలా? చంటిపిల్ల బొమ్మలతో ఆడుకుంటూ ఏదో వాగుతోంది. ఎప్పుడూ ఆవాగుడు వినడానికి సరదాపడేది. ఆవేళ చిరాకుపడసాగింది కమల. అత్తయ్య తనతో మాట్లాడడం లేదని తెలుసుకొని బుచ్చి బొమ్మలు తీసుకొని ప్రక్కింటికి వెళ్లింది. కమల వీధిలోకీ లోపలికీ పచారు చేస్తోంది.

 **అబల** 



ఇటీవల షష్టిపూర్తి చేసుకున్న తెన్నేటి విశ్వనాథంగారు.

గడియారం ఆగిపోయిందేమోనని అనుమానం వేసి దగ్గరకు వెళ్ళింది. 'టిక్కు టిక్కు' మంటూ నేవుంది గడియారం ఎలాగో చిన్న ముల్లు పదిని సమీపించసాగింది.

వీధిలో ఎవరో పరుగెత్తుకు వస్తున్నట్లు చప్పుడై బయటకు పరుగెత్తింది కమల. దూరంనుంచే "మీరు పాసయ్యారండో య్" అంటూ అరుస్తూవచ్చాడు కుర్రవాడు. కమల వాడిచేతిలోనుంచి పేపరు లాగుకొని పేజీలు తిరగవేసి తన నంబరు చూసుకుంది. "అమ్మయ్య" అని ఒక్కసారి దీర్ఘంగా ఊపిరి విడిచింది. ఒక్క క్షణంలో యెంత మార్పు! అప్పటివరకూ ఆందోళనతో కుంచించుకుపోయిన గుండె ఇప్పుడు సంతోషంతో పొంగిపోతోంది. 'వదినా! వదినా' అంటూ పెద్దగా కేకలువేస్తూ లోపలికి పరుగెత్తింది ఆమె. సూర్యకాంతం "ఏమిటమ్మా యేమిటది?" అంటూ ఇవతలకు వచ్చింది.

"పాసయ్యాను, వదినా, నేను పాసయ్యాను" అంది కమల ఆనందంపట్టలేక.

"అంతేనా! నీకేకలు విని ఏపిల్లైనా ఎక్కడైనా పడిపోయిందేమో అనుకున్నాను. అంత పెద్దగా కేక వేయకపోతే మెల్లగా వచ్చి చెప్పకూడదూ. అబ్బ, ఇంకా నా గుండె అదురు తగ్గలేదు" అంది సూర్యకాంతం గుండెదగ్గర చేయిపెట్టుకొని.

కమల ఆమె మాటలను పట్టించుకోకుండానే "నేను చెప్పలేదూ పాసవుతానని చూడు ఇదుగో నా నంబరు", అంటూ పేపరు చూపించబోయింది.

"నాకెందుకమ్మా, నాకేం తెలుస్తాయి నేను నీలా చదువుకున్నదానిని కానుగదా, నీకేం సరేతులు పాసవుతావు రేపు బి. ఏ చదువుతానంటావు. చదివించే అన్నగారున్నారుకదా. ఇంట్లో పిల్లలకు కట్టుకుందుకు సరిగా గుడ్డలు లేకపోయినా, మంచి తిండికి నోచుకోకపోయినా చెల్లెలి చదువుమాత్రం ఆయనగారికి ముఖ్యం" అంటూ మొగం త్రిప్పివేసుకొని వెళ్ళిపోయింది సూర్యకాంతం.

కమల వదినగారి మాటలు విననేలేదు తన సహాధ్యాయినుల నంబర్లన్నీ కూడా చూస్తూ, ఇప్పుడు తను పాసయిపోయింది కాబట్టి తప్పినవారి కందరికీ ఒక 'అయ్యో పాపం' పడవేస్తోంది. అన్నగారి పిల్లలు రాగానే "నేను పాసయ్యానర్రా" అని చెప్పింది. వాళ్లు "అత్తయ్య పాసయింది, అత్తయ్య పాసయింది" అంటూ చప్పట్లు కొడుతూ గెంతులు వేయసాగారు. కమల వాళ్లందరికీ సరిగా తెలిసినా తెలియకపోయినా తన నంబరును చూపించి, తనతో బాటు ఇంకా ఎవరు పాసయ్యారో, ఎవరు తప్పారో చెప్పతోంది.

అన్నగారు వస్తూండడం చూసి "నేను పాసయ్యా నన్నయ్యా' అంటూ ఎదురుగా పరుగెత్తుకు వెళ్ళింది.

"పాసయ్యావా" అన్నాడు గోపాలం ముక్తసరిగా ఏమాత్రం ఉత్సాహం చూపకుండానే.

కమల "జానకీ, లలితా వాళ్ళూకూడా పాసయ్యారన్నయ్యా. పాపం నాగమణి పూర్తిగా తప్పింది—" అంటూ చెప్పుకుపోతోంది. కాని గోపాలం అదేమీ వినిపించుకోక "పెద్దమ్మాయీ, నాకు నీళ్ళు తోడే ఉంచావా, స్నానం చేస్తాను" అని కేక వేశాడు.

"నీళ్ళుతోడి గంటసేపయింది. వంటకూడా అయి అన్నీ చల్లారిపోతున్నాయి. త్వరగా స్నానంచేసి భోజనానికి లేస్తారా లేక చెల్లెలిగారి పాసవడం సంతోషంలోపడి అన్నీ మరచిపోతారా" అని అడిగింది సూర్యకాంతం వెటకారంగా. గోపాలం చొక్కా విప్పి, తువ్వాలు పైనవేసుకొని కమలకేసి తిరిగిచూడకుండానే దొడ్లోకి వెళ్ళిపోయాడు.

కమల అక్కడే తలుపు కానుకొని నిలబడిపోయింది అన్నయ్య ఇలా ఉన్నాడేమిటి? ఎంత సంతోషం చూపవలసింది! ఎంత హడావుడి చేయవలసింది! అటువంటిది ఇలా చిరాకుగా, నిరుత్సాహంగా ఉన్నాడేమిటి అనుకుంది కమల. ఆమెకు చాలా బాధవేసింది. కాని అన్నయ్య ఇలా ఉండడానికి ఏదో కారణం ఉండే ఉంటుంది - బహుశా ఊళ్లో ఎవరితోనో పేచీపడి ఉంటాడు. లేక ఏ వ్యవహారంలోనో ఇబ్బంది వచ్చి ఉంటుంది - అంతే కాని మరేమీ అయి ఉండదు ఆ నిరుత్సాహం కొంతసేపటికి ఎగిరిపోతుందనుకుంది అంతే, మళ్ళీ భవిష్యత్ స్వప్నసీమల్లోకి ఆశల గుర్రాలు పరుగెత్తడం మొదలు పెట్టాయి. ఆ సంతోషంతో అన్నగారి నిరుత్సాహమూ, వదినగారి దెప్పిపొడుపులూ అన్నీ మరచిపోయి పిల్లలతో కబుర్లు చెబుతూ కూర్చుంది ఇంతలో వదినగారు కేకవేసింది "ఆయన వచ్చి కూర్చున్నారు. నీవుకూడా భోజనానికి లేస్తావా అమ్మా" అని. 'వస్తాను వదినా' అంటూ కమల కాళ్లు కడుక్కొని వంటింట్లోకి పోయి పీటమీద కూర్చుంది

వదినగారు ఏమీ మాట్లాడకుండానే వడ్డించింది. గోపాలం మౌనంగా భోజనం చేస్తున్నాడు. కమల తన ఆలోచనల్లోపడి పరధ్యానంగా తింటోంది నెయ్యి వేసుకున్నా ఆ సంగతి జ్ఞాపకంలేక మళ్లీ వేయమని అడిగింది. వదినగారు వెంటనే అంది భర్తకేసి తిరిగి: "ఏమండీ చూశారా, మీ చెల్లెలిగారికి ఒకటికి, రెండుసార్లు నెయ్యి కావలసివస్తోంది చెప్పు నాగో అంటిస్తె నెయ్యి తెప్పించండి' అంది. గోపాలం ఒకసారి తలెత్తి చెల్లెలికేసి చూసి మళ్ళీ తల వంచుకొని తినసాగాడు. కమల పొరపాటు తెలుసుకొని "అక్కర్లేదులే వదినా, వేసుకున్నమాట మరచిపోయానంతే" అని వదినగారు నెయ్యి వడ్డిస్తూంటే అడ్డుపెట్టింది. "అవునమ్మా మరచిపోతావు. ఇంట్లో పరిస్థితులూ, మా బాధలూ నీకేం జ్ఞాపకం ఉంటాయి? మమ్మల్ని సృష్టించాడు చాలదూ భగవంతుడు మడితలో బడి ఎలుకల్లా కొట్టుకుచావడానికి," అని దెప్పిపొడిచింది వదినగారు

కమల భోజనంచేసి లేచి పిల్లలకు కూడా అన్నాలు పెట్టి కంచాలు కడిగి గూటిలో పెట్టి వచ్చి తనగదిలో కూర్చుంది టేబిల్ మీద బొమ్మల పత్రిక తిరగవేయసాగింది నాలుగు పేజీలు తిరగవేసి అడ్డంగా పడవేసి ఒక

కథలపుస్తకం తీసింది. ఒక కథ మొదటి పేరాయే ఐదుసార్లు చదివి అర్థంకాక బల్లమీద గిరవాటువేసి మంచంమీద బోర్లగిల పడి ఆలోచనల్లో మునిగిపోయింది.

ఆమె చిన్నతనంలో చుట్టాలెవరేనా ఇంటికి వచ్చినప్పుడు ఆమెను చూసి బుగ్గ గిల్లుతూ 'నువ్వు పెద్దదానవైతే ఏంచేస్తావు' అని అడిగేవారు. 'నేను 'బియ్యే' చదువు తాన'ని చెప్పేది. వాళ్ళు ఆ మాటలకు పకపక నవ్వి "అదేమిటే మరి పెళ్ళి చేసుకోవూ? బియ్యేచదివినదాన్ని త్వరగా ఎవరు చేసుకుంటాడు" అనేవారు. వాళ్ళ నవ్వేందుకు కోపంతో మళ్లీ మాట్లాడేది కాదు కమల. వాళ్లు ఆమె తండ్రితో "ఏమోయ్, మీకమల కిరస్తానీ మనిషిలా ఏ బడిపంతులమ్మగానో తయారయ్యేట్లుంది. చేతికందినవాడికిచ్చి ఇప్పుడే పెళ్లిచేసేయ్ ఎందుకైనా మంచిది, పెద్దదైతే పెళ్ళి చేసుకోనంటుందేమో" అని నవ్వుతూ అనేవారు. వాళ్ళ పరిహాసానికి కమలకి కళ్ళనీళ్లు వచ్చేవి. తల్లి అది చూచి ఆమె నెత్తుకొని ముద్దుపెట్టుకుంటూ "వాళ్లమాటల కేమిటి తల్లీ, వాళ్లలాగే అంటారు. నీవు నిక్షేపంలా బియ్యే చదివి ఏ కలెక్టరునో పెళ్లాడుదువుగాని" అని లోపలికి తీసుకుపోయేది.

ఆ చిన్నతనంలో కమలకి బి. ఎ. చదువే చాలా గొప్పచదువుగా కనిపించేది. కాని ఇప్పటికీ ఆమెలక్ష్యం బి. ఏ. పాసు కావడమే. బి. ఎ. చదువులో ఒకగౌరవముంది. అంతవరకు చదివిన వ్యక్తికి కూడా గౌరవం కలుగుతుంది. బి. ఏ. చదివిన భార్యను ఎటువంటి భర్తయినా బానిసగా చూడలేడు. తన భావిజీవితంలో తనకు తగిన గౌరవం లభించాలనే ఆకాంక్ష బి. ఏ. చదువుపట్ల అంత ఆసక్తి పురికొల్పింది. అంతేకాని ఆ లక్ష్యంకోసం ఇతర అభిలాషలూ, వాంఛలూ వదులుకోవలసిన అవసరమామెకు కన్పించలేదు. పెద్ద పెద్ద చదువులు చదివి పెద్దఉద్యోగాలు చేస్తూ బ్రహ్మచారిణులుగా ఉండిపోయే వారి జీవితం తలచుకుంటే ఆమెకు భయంవేసేది. ఊపిరాడనట్లనిపించేది. వారి జీవితం ఎడారి ప్రాయంగా తోచేది. ఆమె హృదయం నిండా తీయని కోర్కెలూ, ఆవేశాలూ, ప్రేమానురాగాలూ ఉన్నాయి. లక్ష్యసాధనతోపాటు అవికూడా పరితృప్తి కోరుతున్నాయి. ఆమె ఇప్పుడు తన లక్ష్యసాధనలో చివరిమెట్టుమీద కాలిడబోతోంది. మరి రెండేళ్ళలో ఆమెలక్ష్యం నెరవేరబోతోంది. ఆపైన తాను గడపబోయే జీవితం గురించి కలలుగంటూ అలాగే ఉండిపోయింది చాలాసేపు. రెండుగంటలకు తన స్నేహితురాండ్రను కలుసుకొని రావాలని బయలుదేరింది.

కాని అప్పుడే వదినగారు వసారాలో గోనెపట్టా పరచి పైన తిరగలివేసి కూర్చుని కమల ఎక్కడికో వెళ్ళడంచూసి అడిగింది: "ఏవమ్మా ఎక్కడికి వెళ్తున్నావు?" అని.

"మా క్లాసు పిల్లలని కలుసుకోవడానికి వదినా, ఏం ఎందుకు అడుగుతున్నావు?" అంది కమల.

వదినగారు 'ఊఁ సరే' అని పెద్దగా మూలిగి తిరగలి తిప్పుతూ గొణగడం ప్రారంభించింది: "వెళ్ళమ్మా వెళ్లు. సరదాలూ కాలక్షేపాలూ నీకుకాక నాకేమిటి? అంతులేని చాకిరికోసం నాపుట్టుక రాశాడు భగవంతుడు. దాసీదానిని పెట్టుకునే తాహతేనా లేదుకదా. అసలు ఇంట్లో ఖర్చులేని దాసీది ఉన్నప్పుడు మరోదాసీది ఎందుకు?"

కమల అక్కడే ఆగింది. కొన్నిక్షణాలు అలాగే నిలబడి వెనక్కివచ్చి కూర్చుని వదినగారికి సాయం చేయబోయింది. మూర్తీకాంతం "వద్దులే వెళ్ళమ్మా" అని ఆమెను తోసివేయబోయింది. కాని కమల తిరగలి తిప్పసాగింది. ఎప్పుడూ వదినగారు ఆమె చేత అన్నిపనులూ చేయించుకుంటూనే ఉంటుంది. ఈ ఇంట్లో పనులవల్ల ఆమె చదువుకోవడంకూడా చాలా కష్టమైంది. అందుకే పాసవుతానా లేదా అని ఆమె సంకోచించవలసి వచ్చింది. అయినా ఆమె ఇంతపనిచేస్తున్నా వదినగారు చాకిరీ అంతా తనే చేస్తున్నానంటూ బాధ పడుతుంది. ఆమె అంతులేని సణుగుళ్లూ గొణుగుళ్లూ వింటూంటే కమల కప్పుడప్పుడూ చాలా నిరుత్సాహం కలిగి చదువు మానేద్దామా అనిపించేది. అయినా ఎలాగో తనలక్ష్యం చేరుకోవాలనే ప్రబలకాంక్షతో ■ బాధలన్నీ సహిస్తూనే ఇన్నాళ్లూ కాలక్షేపం చేసింది. ఈనాడు పాసయింది కాబట్టి వెనుకటిబాధలూ, నిరుత్సాహాలూ, నిట్టూర్పులూ అన్నీ మరచిపోయి ఎంతవరకూ తాను బి. ఏ. లో ప్రవేశించబోతున్నాననే విషయమే తలచుకుంటూ పొంగిపోతోంది. పరధ్యానంలో తిరగలి అతి విసురుగా తిప్పసాగింది. దానితో వదినగారు "అబ్బ, వెళ్ళవమ్మా అంటే! బియ్యం బియ్యంగా పడిపోతున్నాయి!" అని బలవంతంగా కమలచేయి తీసివేసింది. కమల నవ్వుకుంటూ జానకియింటికి పరుగెత్తి పోయింది.

జానకి ధనవంతులబిడ్డ. ఆమెది పెద్దమేడ. ఇంట్లో రేడియోగ్రాము, మంచి లైబ్రరీ, కుషన్ కుర్చీలూ, ఫానులూ వంటి సౌకర్యాలన్నీ ఉన్నాయి. నౌకర్లున్నారు. అందువల్లే స్నేహితురాండ్రందరూ ఆమె ఇంటివద్దే చేరుతూంటారు. కమల వాకిలికి

(48 వ-పేజీ చూడండి)

# ఆంధ్రపత్రిక

## సచిత్ర వారపత్రిక

# సంక్రాంతి సంచిక

# కథానికల పోటీ

### మొదటి బహుమతి రు. 75 రెండవ బహుమతి రు. 50.

## రచనలు చేరవలసిన ఆఖరుతేది 10-12-55

ఆంధ్రపత్రిక - సచిత్ర వారపత్రిక 1956-సంక్రాంతి ప్రత్యేక సంచిక ప్రచురణ పురస్కరించుకుని కథానికా రచనకు ప్రోత్సాహమివ్వవలెననే ఉద్దేశంతో పోటీ జరపాలని నిశ్చయించాము.

పోటీకి వచ్చే కథానికలలో శ్రేష్ఠమైన రెండు రచనలకు రు. 75, రు. 50 బహుమతులివ్వబడతాయి.

సామాజిక ఇతివృత్తాలుగల స్వతంత్ర రచనలే పోటీకి స్వీకరించబడతాయి.

పోటీ కథానికలు మా కార్యాలయానికి 1955 డిసెంబరు 10 వ తేదీలోగా చేరాలి.

బహుమతుల గురించిన తుది నిర్ణయాధికారం సంపాదకులకే ఉంటుంది.

పోటీకి పంపే కథానికలకు రేపర్లపైనా, రచన మొదటి పుట పైనకూడా స్పష్టంగా "ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక సంక్రాంతి కథానికల పోటీకి" అని వ్రాయాలి.

రచనలు తెల్ల కాగితాలలో సిరాతో ఒకే వైపున వ్రాసి పంపాలి.

బహుమతి నిర్ణయం అనంతరం ప్రచురణకు-స్వీకరించబడని రచనలను త్రిప్పి పంపగోరే రచయితలు తమ రచనలతో పాటే తిరుగు పోస్టుకు అవసరమైన స్టాంపులు జతపరిచి పంపాలి.

సంక్రాంతి సంచికకు గాను ఇతర వ్యాసాలు, కథానికలు, చిత్రాలు, ఫొటోలు పంపదలచిన వారు కూడా 1955 డిసెంబరు 10 వ తేదీలోగా మా కార్యాలయానికి అందేటట్లు పంపాలి. చిత్రాలు ఇండియన్ ఇంక్‌లో వ్రాయాలి. ఫొటోలు గ్లాసీ ప్రింట్స్ మాత్రమే; కార్డు సైజుకి తక్కువ కాకుండా ఉండాలి.

రచయితలు ఈ సదవకాశాన్ని వినియోగించుకుని మా సంకల్పాన్ని జయప్రదంగా నెరవేర్చగలరని ఆశిస్తున్నాము. —సంపాదకుడు.

# పార్వతి

—శివరామ్—

ఊరునుంచి వచ్చి అప్పుడే యింట్లో ప్రవేశించిన శ్రీమన్నారాయణగారు కాళ్లూ, చేతులూ, ముఖం కడుక్కొని, పడకకుర్చీలో వాలి "హమ్మయ్య-" అనుకుంటూ, అక్కడే నేలమీద పడివున్న తుండుతో ముఖం తుడుచుకుంటూంటే, ఆయనభార్య జ్ఞానాంబ, నవ్వుతూ మరచెంబూ, నీళ్లతో అక్కడికి వచ్చి "ఏమండీ? ఏమిటండీ విశేషాలు?" అని అడిగింది.

శ్రీమన్నారాయణగారు జవాబివ్వక, నిదానంగా భార్యవయిపు చూస్తూ, సన్నగా నవ్వి, కొద్దిగా తీర్థంపుచ్చుకొన్నాడు.

"ఏమండీ మాట్లాడరు...ఏమయినా సంబంధాలు తగిలాయా? లేక వెళ్లినట్లుగానే తిరిగివచ్చారా?"

"వెళ్లినట్లుగా తిరిగిరావటంయేమిటి? ఫస్టుక్లాసయిన కుఱ్ఱవాడ్ని చూసివచ్చాను...ఆ కుఱ్ఱవాడ్ని నేనే మోహించానంటే నమ్మ" చమత్కారంగా శ్రీమన్నారాయణగారంటూంటే—

"చాల్లెద్దురూ...మీ వేళాకోళాలూ... మీరూను. వాటికి సమయం, సందర్భం వుండక్కరలేదూ?"—అని జ్ఞానాంబ చిరుకోపం ప్రదర్శించబోయింది.

"నిజంగా నేనే...నీతో నే నెప్పుడైనా అబద్ధం ఆడానా?"-భర్త పైవిధంగా మాటలనటంతోటే, జ్ఞానాంబకు కుతూహలం వృద్ధిఅయింది "నిజంగానే, కుఱ్ఱవాడెలాగుంటాడు? ఏం చదువుకొన్నాడు? వాళ్లింటిపేరేమిటి? ఏమాత్రం ఆస్తిపాస్తులున్నాయి? ఎంతమంది పిల్లలున్నారు? ఆ అబ్బాయి తల్లిదండ్రు లెటువంటివాళ్లు?" - ఈ ప్రశ్నలన్నీ ఒకదానితరువాత ఒకటిగా ఆవిడ అడిగేసింది.

శ్రీమన్నారాయణగారు నవ్వుతూ యీ విధంగా చెప్పాడు: "కుఱ్ఱవాడిపేరు శేషగిరి. బి. ఏ. సీనియరు చదువుతున్నాడు. ఈ దినమే కుఱ్ఱవాడ్ని, మిత్రుడు సుదర్శనం చూపగా కళ్లారా చూశాను. మంచి అందంగా వుంటాడు; ఆ అందానికితోడు వినయ, విధేయతలు; చాలా మృదువైన కంఠం. మంచి సంప్రదాయ కుటుంబానికి చెందిన కుఱ్ఱవాడు. తండ్రిపేరు పున్నయ్యగారు. తహశీలుదారు వుద్యోగంచేసి రిటైరై మంచి పేరుప్రతిష్ఠలు సంపాదించుకొన్నారాయన. వారికి యితడు ఒక్కగానొక్క కొడుకు..." ఈ విధంగా భర్త చెబుతూంటే విషయాలన్నీ అనుకూలంగా వుండటంవల్ల జ్ఞానాంబ వింటూ మురిసిపోతూంది.

"శేషగిరితప్ప వేరు ఆడసంతానమయినా వారికి లేదు-పిల్లవాడ్ని-వాళ్లు పువ్వుల్లో పెట్టి పెద్దచేసుకుంటున్నారు...ఆస్తి ఏభైఎకరాల పొలంవుంది; పాతిక వేలరూపాయల క్యాషు, ఒక మేడ - పున్నయ్యగారికి వున్నాయి. చదువుకొన్నదీ, వినయ విధేయతలు కలిగి, చురుకైనదీ పడుచుపిల్లను కోడలుగా స్వీకరించాలని వాళ్ళ తలంపు. అన్నివిధాలా...మనకు తగిన సంబంధం...మన పార్వతిలో - ఆ చదువు సంధ్యలూ - అందచందాలూ - వినయ విధేయతలూ అమరివున్నాయి...అందువల్ల మరి ఆటంకాలేమి వుంటాయ్?" - శ్రీమన్నారాయణగారింకా యేమిటో చెప్పబోతూంటే- కాంతితో నిండిన ముఖాన్ని చిన్న బుచ్చుకొని: "మంచిపని చేసుకువచ్చారు. అటువంటి సంబంధాలజోలికి మన పోవటం యెందుకు చెప్పండి?" అంది జ్ఞానాంబ.

'అంటే'- శ్రీమన్నారాయణగారు ఏమీ అర్థంకాని పరిస్థితిలో తెల్లముఖం వేశాడు.

"ఏంవుందండీ? ఆ సంబంధం అన్నివిధాలా మన కనుకూలంగా వుంటేమాత్రం, మన పార్వతికి - తగినదయితే మాత్రం - వారు ఆకాశంమీద కూర్చుని కోరేకోర్కెలు తీర్చే స్థితిలో మనం లేనప్పుడు అటువంటి సంబంధం మీరు చూసిరావడం యెందుకు చెప్పండి? వారు కట్నకానుకలగా ఏ పదివేలో అడుగుతారు? యేవేవో లాంఛనాలపేరుతో మరో రెండుమూడువేలు గుంజ ప్రయత్నిస్తారు... పెళ్ళి చేయ్యటానికి మరో నాలుగువేలు...మన ఆస్తిపాస్తులన్నీ తెగ అమ్ముకుంటే పదిహేను వేలు చెయ్యవే... అటువంటప్పుడు - అటువంటి సంబంధాన్ని తెచ్చుకొని, అమ్మాయికి పెళ్ళి యేలాగ చేయగలుగుతామండీ! పోనీ ఒక్క పార్వతే అనుకుంటే - పార్వతితర్వాత మరో ఐదుగురమ్మాయిలున్నారు గదా? వాళ్లగతేం కావండీ? మీరు యేంచేదా మనుకుంటున్నారోగాని, - మన పిల్లల్ని తలుచుకుంటూంటే - హృదయం యెంతగానో క్షోభిస్తుంది...కన్నబిడ్డలకు- తగినవరులను చూచి వివాహంచేసి, బాధ్యత తీర్చుకోలేని కరకు మనుష్యులం....మనం" - యీ విధంగా జ్ఞానాంబ - బాధ వెడలగ్రక్కుతూ యేమిటేమిటో అంటూంటే -

శ్రీమన్నారాయణగారి కళ్ళల్లో గూడా, నీళ్లునిల్చాయి. ఆయన కొంతసేపు ఆగి: "అవును నువ్వు అన్నమాటల్లో అసత్యం లేదు....కానీ"- అని ఆయన ఆగిపోయాడు.

"ఏమిటది?" - జ్ఞానాంబ భర్తవయిపు చూసింది...

"ముందు భవిష్యత్తు యేవిధంగా వున్నా- పార్వతికి - తగిన వరుడ్ని చూచి పెళ్ళి చేయాలనే - తలంపుమూలంగానే యీ సంబంధం చూడటం జరిగింది. సత్సంప్రదాయాలతో నిండిన - ఆ సంబంధాన్నే - పార్వతికి నిశ్చయించాలనే నా తలంపు - ఆ కుఱ్ఱవాడ్ని చూడటంతోటే మరింత దృఢపడింది. పైగా - సుదర్శనం - ఒక మాటకూడా అన్నాడు. తహసీలుదారు వుద్యోగంచేసి, ఫించను పుచ్చుకుంటున్న పున్నయ్యగారికి కట్నకానుకలమీద ఆశలేదనీ - వారికి కావలసింది, పిల్ల నచ్చటం అనీ, పిల్లనచ్చినపక్షంలో - వాటిని గురించి వాళ్లు అంతగా పట్టించుకోరని తాననుకుంటున్నాననీ అన్నాడు. పున్నయ్యగారు వొకప్పుడు - "కట్నకానుకలు పుచ్చుకోకూడదని" - బహిరంగ ఉపన్యాసాలిచ్చేవాడట. అందువల్ల - ఒకవేళ కోరినా యేదో లాంఛనప్రాయంగా- కోరటం జరుగుతుందికాని-మనకు దానివల్ల కలిగేయిబ్బంది ఆట్టేవుండదని అతనన్నాడు. సుదర్శనం పున్నయ్యగారి పొరుగువాడవటంవల్ల, ఆయన మంచిచెడ్డలు - అతగాడికి బాగా తెలిసి వుంటాయనుకుంటూ - అతడితో కలసి వాళ్లయింటికి వెళ్లాను... పున్నయ్యగారు, ఆయనభార్యా, యెంతో తీయగా మాట్లాడారు. సుదర్శనం, మన అమ్మాయిసంగతి చెప్పాడు. నేను పార్వతి ఫోటో వాళ్ళకిచ్చాను. చూసి, సంతృప్తి వెల్లడించి "అవస్యం చూడటానికి వస్తాం... అబ్బాయికి త్వరగా పెళ్ళి చేసేయాలి" —

అన్నారు పున్నయ్యగారు. "కోడలు రాక కోసం - నేనెంతో కాలంనుంచి యెదురు చూస్తున్నాను. ఏమిటో అశ్రద్ధ అయిపోతూంది...తప్పక త్వరగా పెండ్లిచేయాలి" అంది యజమానురాలు ... అప్పటి కప్పుడే మంచిదినంచూడటం జరిగింది. వచ్చే ఆదివారం తాము తప్పక రాగలమని పున్నయ్యగారు చెప్పారు ...

వచ్చేస్తూ: "ఈ బీదవాడిమీద వోకకన్ను వేయండి" - అన్నాను నేను తమాషాగా!

ఆయన నొచ్చుకుంటూ: "అ...యెంత మాట సెలవిచ్చారు? గొప్పా...బీదా యేమిటండీ? పుట్టినప్పుడంతా డబ్బుతో పుట్టారా? వచ్చేటప్పుడు డబ్బుతో వస్తారా! మీరటువంటి మాటలంటే నా మనస్సు చాలాబాధ పడుతుంది. అంతా వోకటే" అన్నారాయన.

"ఈవిధంగా వుదారంగా ఆయన మాటాడుతూంటే నే యేమనుకోవాలి? అసలాయన కట్నకానుకలు కోరడనే, నా వుద్దేశం - అన్నాడు - సుదర్శనం. ఒకవేళ కోరినా గొప్ప - బీదల తారతమ్యం గుర్తించిన వ్యక్తి కనుక - యేకొద్దిమొత్తమో - మనశక్తి ననుసరించి కోరుతాడనుకొన్నాను నేను. అందువల్ల ...."

ఇప్పటికి జ్ఞానాంబకు, సంతృప్తి కలిగినట్లుంది "అవును. అటువంటి మహానుభావులుమాత్రం వుండకూడ దేమిటి? - మనం అదృష్టవంతులమైతే - ఆ సంబంధం మనకే కుదరకూడదూ? కట్నకానుకలు మేంపుచ్చుకోమని వాళ్ళనకూడదూ! అంతా-పార్వతి అదృష్టం. ఇంతకీ ఆ అబ్బాయి ఫోటో తెచ్చారా?" - అని అడిగిందావిడ.

"ఆ" అంటూ శ్రీమన్నారాయణగారు ఫోటోతీసి భార్యకిచ్చాడు.

ఆవిడ జాగ్రత్తగా పరిశీలించి, సంతృప్తి వెల్లడిస్తూ: "మనకదృష్టం వుంటే యీ సంబంధం నిశ్చయం అవుతుంది"—

"ఇంతకీ పిల్లలంతా యేరీ? పార్వతి యెక్కడ?" - శ్రీమన్నారాయణగారడిగాడు.

"పార్వతి గదిలో యేదో కుట్టుకుంటోంది. పిల్లలంతా, ప్రక్కయింటికి వెళ్లారు...ఇంతకీ..దానికి కుఱ్ఱవాడి ఫోటో చూపలేదు యింకా! అదిచూచి, ఒప్పుకొనిసంతోషించాలి కదా" - అంటూ జ్ఞానాంబ, పార్వతివున్న గదివయిపు నడచింది. శ్రీమన్నారాయణగారేమిటో ఆలోచించటం ప్రారంభించాడు.

* * *

పెళ్ళివారు, పార్వతిని చూసుకోటానికి బయలుదేరి వస్తామన్న ఆదివారం వచ్చింది..

ఆ మధ్యాహ్నం..రెండుగంటల బండికి, వస్తున్నట్లుగా, పున్నయ్యగారి దగ్గరనుంచి, అంతకు రెండురోజుల క్రితమే వుత్తరం గూడా వచ్చింది. మిత్రుడు సుదర్శనంతో, యిదివరలో, యీ సమయంలో రావలసిందని, శ్రీమన్నారాయణగారు చెప్పాడు. కానీ తనకు రావటానికి వీలుండదంటూ - అతడు వుత్తరం వ్రాశాడు.

శ్రీమన్నారాయణగారు పెద్దగా ఆస్తిపాస్తులున్న వ్యక్తికాదు. ఆ సంగతి మీ అందరికీ తెలుసు. అయితే - వియ్యమంద తలబోస్తున్న, పున్నయ్యగారి, ఐశ్వర్యాన్ని హోదాను పురస్కరించుకొని- పెద్దయెత్తున యింట్లో యేర్పాట్లు చేశాడు. ఇంచుమించుగా, డబ్భైరూపాయలు - పెళ్లివారి రాక సందర్భంలో ఆయన, యింటికి ఖర్చులుచేశాడు. తాను "వాళ్ళఅంతస్తుకు-తూగ గలవాడు కాకపోయినా - అటువంటి వారి నెయ్యం వాంఛిస్తున్నందున ఆ విధంగా భేషజం ప్రదర్శించాలని, ఆయన అనుకొన్నాడు - అందులోనూ యిదే-మొదలు ఆయన పెళ్లివారి నాహ్వానించటం! ఇల్లంతా యెరువుతేబడిన అలంకరణలతో అలంకరించబడింది...పిల్లలందరికీ శుభ్రంగా కన్పడటంకోసం - మరో యేభైరూపాయలు ఖర్చుచేసి, బట్టలు కుట్టించాడాయన. మరో గంటకు రైలు వస్తుందనగా - జ్ఞానాంబ, పిల్లలందరినీ ముస్తాబుచేసింది; పార్వతి, తల్లికి పనుల్లో సహాయపడుతూంది....కాని తల్లి ఆమె సహాయం అశించటంలేదు. పిల్ల యెక్కడ కందిపోతుందో అని ఆవిడభయం. "నీగొడవ నువ్వు చూసుకుందూ—"అంటూ చిన్నగా పార్వతిని కసురుకొని, ఆమె యేమో చేస్తూంటే, పెళ్ళివారియెదుట, పెండ్లికుమార్తెగా - నడుచుకోవలసినవిధం గురించి, ఆవిడ యెంతగానో చెబుతూంది. పార్వతి నిశ్శబ్దంగా వూకొట్టుతూంది...

* * *

మరో అరగంట అనంతరం—

శ్రీమన్నారాయణగారు, యేకాంతంగా పార్వతిని పిలచాడు...

"వద్దు, వద్దంటు"న్నా "ఫరవాలేదు... ఇటువంటి సమయాల్లో తప్పక వేసుకోవాలి" అని - బలవంతంచేసి, అలంకరణంచేసిన యెరువు నగలతోనూ, నూతన వస్త్రాలతోనూ - చక్కగా, యిరుగుపొరుగు అమ్మలక్కలచేత అలంకరింపబడిన పదహారు సంవత్సరాలపడుచు పార్వతి - ఒక దివ్యాంగన విధంగా తండ్రి యెదుటకు వచ్చినిల్చుంది..

శ్రీమన్నారాయణగారు, కుమార్తెను, పిలచిన సంగతి మరచి యేకదీక్షతో చూసి, తనతో తాను యెంతగానో ఆనందాన్ని అనుభవిస్తూ యేమిటో యోచిస్తున్నాడు. నిజంగా - పార్వతి - తనకు కూతురై పుట్టినందుకు తానెంత అదృష్టవంతుడు? చదువుకు చదువు; రూపానికి రూపం; వినయానికి వినయం - నేర్పుకు - నేర్పు - ఓర్పుకు-ఓర్పు అన్నీ పార్వతిలో మూర్తీభవించి వున్నాయి... పార్వతినీ చేబట్టే యువకుడు యెంత అదృష్టవంతుడవుతాడో! ఛీ అవేం ఆలోచనలూ ... పార్వతికోసం - తానొక ఘనమైనసంబంధం తీసుకువస్తే - ఏ విధంగానైనా- సరే - కావలసివస్తే - వలసినకట్నం యిచ్చుయినాసరే సంబంధాన్ని నిశ్చయం చేసుకుతీరాలి...

"ఏమటి నాన్నా! నన్ను పిలిచారట-" అంది పార్వతి...

పైవిధంగా ఆలోచనల్లో మునిగితేలుతున్న - శ్రీమన్నారాయణగారు తేరుకొని, చిన్నగా నవ్వుతూ! "ఆ పిలిచానమ్మా.."- అన్నాడు...

"ఎందుకూ?—" మృదువుగా అడిగింది పార్వతి.

"ఏంలేదమ్మా...ఒక మాట...నువ్వు తెలివయినపిల్లవ్ ... మా అదృష్టంకొద్దీ - మా అమ్మాయివై పుట్టావు...నీకుతగిన సంబంధం తీసుకురావటానికి నేనెంతగానో శ్రమపడ్డాను. ఈనాడు - రాబోయే సంబంధం, మన కదృష్టంకొద్దీ తారసపడ్డది - వారు సౌమ్యులు. పెద్దగా ఆస్తిపాస్తులు గల గొప్ప కుటుంబీకులు. వారితో మనం తూగలేం కాని- గౌరవమర్యాదలూ- గుణగోత్రాలూ- వారితో సరితూగగలవు. వారు కొన్ని ఆదర్శాలు కలవారు కనక -తప్పక ఒప్పుకుంటారని నానమ్మకం - ఏమైనా - వారు నిన్ను యేమైనా అడిగితే వినయంగా జవాబియ్యి ఓర్పు వహించు. అంతకంటె నువ్వేమీ చేయనక్కరలేదు తల్లీ...ఇక మిగిలినసంగతులు పరిస్థితులనుబట్టి నేను చూసుకుంటా."

పార్వతి తండ్రివయిపు ఒకసారిచూసి "నాన్నా నాదీ ఒకమాట" అంది.

"ఏమిటమ్మా అది?"

"మీరు చెప్పిన విధంగా - కుమార్తెగా నా విధి నేను తప్పక నిర్వర్తించుకుంటాను. కానీ నా కోసం మీరుమాత్రం" - పార్వతి కంఠం రుద్ధమైంది.

"చెప్పమ్మా... చెప్పు"- శ్రీమన్నారాయణగారు ఆదుర్దా కనబర్చాడు.

"నాకోసం-మీరు - వారు కోరే కట్నం యివ్వ సిద్ధపడవద్దు. వారు కోరేది....యెంతైనా అవవచ్చు. వారిమీదవుంటే మక్కువ

కొద్దీ-మన అంతస్థుసంగతి మరచి, మీరు 'వూ' కొడతారు. తరువాత యేమనుకుంటే యేంలాభం? మన యింటిపరిస్థితులు - నా చెల్లెళ్ళ భవిష్యత్తూగూడా మీ మనసులో వుంచుకోండి. నాన్నా! నాకు పెండ్లిచేయటంతోటే మీ బాధ్యత తీరిపోదు...నన్ను సుఖపెట్టాలని ఆరాటపడుతున్న మీమనస్సు చెల్లెళ్ళ సౌఖ్యం మంచీ మాత్రం వాంఛించదూ? మకోవిధంగా అనుకోకండి. ఆడపిల్లనయితేమాత్రం-ంచదువుకొన్న చదువును సార్థకం చేసుకుంటాను. అవసరమయితే - కన్యగానే వుంటాను కానీ నాకోసం-వెట్టిగా-వేలుయోగజిమ్మ శిద్ధపడకండి. మన కుటుంబం భవిష్యత్తుగూడా ఆలోచించండి."

కూతురు వుద్దేశాలు పూర్తిగా గుర్తించిన శ్రీమన్నారాయణగారు "అవునమ్మా... కానీ"-అని యేమో అనబోయాడు.

"తిరిగి కానీ ఏమిటినాన్నా..."

"అదికాదమ్మా...నీ అదృష్టం మంచిదయితే-వారసలు కట్నమే కోరకపోవచ్చు. పున్నయ్యగారు-కట్నాలను పుచ్చుకోకూడదని పూర్వం వుపన్యాసాలిచ్చేవారట. ఒకవేళ కోరినా - ఏదో లాంఛనప్రాయంగా కోరవచ్చు...ఈ రోజుల్లో కట్నం పుచ్చుకోటం, లాంఛనాలలో జమయింది. అందువల్ల-అనవసరంగా నువ్వు దిగులుపడకు... నేను అన్నీ చూసుకుంటాను." వారడిగిన ప్రశ్నలకు-అందంగా సమాధానాలియ్యి. అంతే!" అన్నాడాయన.

"కట్నం....మాత్రం..." - పార్వతి తండ్రితో యింకా యేమో అనబోయింది.

"అబ్బ ఆ గొడవ నీ కెందుకమ్మా...నే చూసుకుంటాగా. మరి లోపలికి వెళ్ళు"-అని శ్రీమన్నారాయణగారనటం తడవుగా—పార్వతి యేమిటో ఆలోచిస్తూ, యింట్లోకి వెళ్ళిపోయింది.

*    *    *

ఆ రోజు రెండుగంటలకు రావలసినబండి ఒకగంట లేటుతో, మూడుగంటలకు స్టేషనుకు వచ్చింది...

మూడుంపావుకు స్టేషనునుంచి, పున్నయ్యదంపతులు, కుమారుడు శేషగిరితోనూ, పురోహితుడితోనూ, జట్కాలమీద శ్రీమన్నారాయణగారింటికి వచ్చారు.

అతిథిసత్కారాలూ, కుశలప్రశ్నలూ - ఒకదానితరువాత, మరొకటి జరిగిపోయినాయి.

తాంబూలాచరణం జరుపుతూ "ఆ... అమ్మాయిని ఒకమారు తీసుకువస్తే"—అన్నాడు పున్నయ్యగారు.

"అవశ్యం" అంటూ శ్రీమన్నారాయణగారు లోపలకు వెళ్ళివచ్చాడు. మరి కొద్ది నిముషాల అనంతరం—

అక్కడ పరచివున్న తివాసీమీదకు—జ్ఞానాంబా, ముత్తయిదువులు - వెంటనంటి తీసుకురాగా - పార్వతి, పార్వతీదేవిలాగ వచ్చికూర్చుంది.

పెళ్లివారిచూపులు పార్వతివైపు నడిచాయి...

పున్నయ్యగారు సంతృప్తికరంగా పార్వతినిచూసి "పేరమ్మా?" అని అడిగాడు!

"పార్వతి"-పార్వతి జవాబిచ్చింది!

"అచ్చంగా పార్వతివే"-అన్నాడాయన భార్యవైపు చూస్తూ.

లక్ష్మీదేవమ్మ సంతృప్తికరంగా, భర్తవైపు చూసింది.

పార్వతి సిగ్గుతో తలదించుకొని, క్రీగంట శేషగిరివైపు చూస్తోంది.

శేషగిరిదృష్టి యెప్పుడో పార్వతిమీద నిలచింది. నిజం చెప్పద్దూ?

ఈ సంబంధం వచ్చిననాడే అతడు పార్వతిఫొటో చూశాడు. ఆ ఛాయాచిత్రం చూడటంతోటే - అతడి హృదయములో పార్వతికి స్థానం యేర్పడింది. నేడామెను-కళ్ళారా చూచి ఆనందించగలుగుతున్నాడంటే! తాను వాంఛించే స్త్రీలక్షణాలన్నీ ఆమె వదనంలో కన్పిస్తున్నాయి. పైగా మృదువైన కంఠం ... చక్కని పలువరుస.

శేషగిరి తదేకదృష్టితో ఆమెను చూస్తున్నాడు. బెదురుతూ బెదురుతూ చూస్తున్న పార్వతిచూపులూ, శేషగిరిచూపులూ ఒక్కసారిగా కలుసుకొన్నాయి.

అది గమనించిన, అక్కడ వున్నవాళ్లంతా వొక్కమారు నవ్వారు; అవసరం తమదికనుక - వాళ్ళతో బాటు తానూ నవ్వాడు శ్రీమన్నారాయణగారు!

శేషగిరీ, పార్వతీ సిగ్గుపడిపోయారు...

అది గమనించిన పున్నయ్యగారు: "తప్పేముందీ? ఒకళ్లనొకళ్లు ... చూసుకోకుంటే అభిప్రాయాలెలా యేర్పడుతాయి? యివి పూర్వంరోజులు కాదుగదా!" అన్నాడు.

"చిత్తం" - అన్నాడు విధేయత ప్రదర్శిస్తూ శ్రీమన్నారాయణగారు.

"సరి...నువ్వేమి చదువుకొన్నావమ్మా" ఇది పున్నయ్యగారి ప్రశ్న.

శ్రీమన్నారాయణగారేమో చెప్పబోయాడు - కానీ ఆయన అడ్డువచ్చి: "ఆగండి అమ్మాయినే చెప్పనివ్వండి. అబ్బాయి విని ఆనందిస్తాడు" అన్నాడు.. అంతటితో శ్రీమన్నారాయణగారు తగ్గిపోయాడు.

"ఏం అమ్మా?"

"థర్డుఫారం ప్యాసయ్యానండి."

"బాగుంది. ఈ కాలం ఆడవాళ్ళకు ఆమాత్రంచదువు చాలు" - అంటూ కొడుకువయిపు చూశాడాయన. ఔనన్నట్లుగా బుఱ్ఱ ఊపాడు శేషగిరి.

"హిందీ యేమైనా చదువుకొన్నావా అమ్మా?"

"మాధ్యమికపరీక్ష ప్యాసయ్యానండి"

"షేష్..." - అంటూ భార్యవైపు చూశాడాయన.

"ఏమయినా పాటలు వచ్చునా అమ్మా" లక్ష్మీదేవమ్మ అడిగింది. కానీ - తల్లిప్రశ్న కుమారుడికి నచ్చనందువల్ల: "అది కాదు సంగీతంలో యేమైనా ప్రవేశంవుందా?" - అని అతగాడు ప్రశ్నించాడు.

సిగ్గును ఒకమూలకు నెట్టి, ఓరగా అతడివయిపు చూస్తూ: "ఆ" - అంది పార్వతి.

"వాద్యం యేమైనా"



 # పార్వతి 

“హార్మోనియం వాయిస్తాను.”

“ఏమైనా పాటపాడుతూ వాయించ గలరా?”

“ఆ” - ఈవిధంగా, వాళ్ళయిద్దరి మధ్యా కొద్దికాలం సంభాషణ సాగింది. సిగ్గును దూరంగా నెమ్మది నెమ్మదిగా వదులుతూ వాళ్లు మాటలాడుకున్నారు. అక్కడవున్న వాళ్లంతా వాళ్ళవయిపు ఆనందంతోనూ, ఆశ్చర్యంతోనూ చూస్తున్నారు.

శ్రీమన్నారాయణగారు యింట్లోంచి హార్మోనియం తెప్పించాడు. పార్వతి వాయించబోతూ “ఏం పాటేది?” అన్నట్లుగా శేషగిరివయిపు చూసింది ...

శేషగిరి కొంచెంసేపు యోచించి: “ఏమైనా సినీమాపాటలు వచ్చా?” - అని అడిగాడు. పార్వతి తలవూపింది.

“ఈ కాలం పిల్లలు సినిమాపాటలంటే - చెవి కోసుకుంటారు” - అని పున్నయ్యగా రంటూంటే -

“గుణసుందరి సినీమా లో పాటలు బాగుంటాయ్” - అంద లక్ష్మిందేవమ్మ.

తల్లికోర్కె, తీర్చ సిద్ధపడ్డాడు తనయుడు. “ఊ. అంగులోపాట వొకటి పాడండి”- అన్నాడు శేషగిరి.

పార్వతి - గుణసుందరి సినీమా లోని “శ్రీతులసి” - అనే పాట హార్మోనియం వాయిస్తూ పాడింది.

పాట పూర్తవటంతోటే “బాగుంది” అని పున్నయ్యగారు మెచ్చుకొన్నారు. శేషగిరి, స్వతహాగా, సంగీతప్రియుడవటం వల్ల, అంతటితో వూరుకోనక - మరోక పాట పార్వతిచేత పాడించాడు.

ఆమె, చిరునవ్వు నవ్వి, ఆపాటగూడా పాడింది.

అది పూర్తవబోతూంటే “ఆట్టే పాడించ గూడదు... అమ్మాయి అలసిపోతుంది—” అన్నాడు, నవ్వుతూ పున్నయ్యగారు...

శేషగిరి, పార్వతీ సిగ్గుపడుతూంటే - అంతా ఒకమారు నవ్వుకొన్నారు.

“సరి - అమ్మాయికి వంటచేయటం వచ్చునాండీ ?-” లక్ష్మిందేవమ్మ అవబోయేవియ్యపురాలు జ్ఞానాంబవయిపుచూసి అడిగింది... జ్ఞానాంబ నవ్వుతూ! “పిండివంటలతో సహితం - మాఅమ్మాయి చక్కగా వంట చేస్తుంది-” అంది...

“సరి .... యిల్లు శుభ్రపరచటం - వంట పనులు చేసుకోటం - ఈ కాలంలో చాలా మంది ఆడపిల్లలకు తెలియవులెండి.... మీ అమ్మాయి మాత్రం...”

“మా అమ్మాయి అటువంటిపిల్ల కాదు లెండి-” జ్ఞానాంబ నవ్వింది.

“సరి మేం అదృష్టవంతులం.”

“ఏమైనా కుట్లు కుట్టగలదాండీ ?-” ఇది పున్నయ్యగారి ప్రశ్న!

“మా తలగడాగలీబులు, రంగుదారాలతో కుట్టాలా ?” లక్ష్మిందేవమ్మ నవ్వింది...

“ఓ”- అంది జ్ఞానాంబ...

“సరయితే”-అని లక్ష్మిందేవమ్మ....భర్త వయిపు చూసింది.

అంతా, మరోమారు తమాషాగా నవ్వుకొన్నారు...

“మరి అమ్మాయిని లోపలికి తీసుకుపొండి ...మేం మాట్లాడుకుంటాం”-అని పున్నయ్యగా రంటూంటే, జ్ఞానాంబ, మరితర ముత్తైదువులూ, పార్వతిని లోపలకు తీసుకు పోయారు...

పున్నయ్యగారు, పురోహితుడివైపు చూస్తూ!... “ఇక మీపని తర్వాయి” అని నవ్వాడు...

“చిత్తం”-అని ఆయన చేదస్తంగా అని. శేషగిరివయిపుచూసి! “ఏం బాబూ ... అమ్మాయి మీకు నచ్చినట్లేకదూ ?”-అని అడిగాడు...

శేషగిరి, మౌనంగా, తల వూపుతూండగా: “నీకెంతిచేదసం అయ్యా? ఇష్టం లేకుంటే అమ్మాయితో అబ్బాయి - అంత సేపు యెందుకు మాట్లాడుతాడు? అమ్మాయి ...మా అందరికీ నచ్చింది ... ఇక నువ్వు తేల్చవలసింది...వ్యవహారంసరా”అన్నాడు పున్నయ్యగారు.

శ్రీమన్నారాయణగారు, గుండె, దడ దడలాడుతూండగా, చిన్నగా చిరునవ్వు నవ్వాడు. ఆయనఇంతవరకూ మేకపోతు గాంభీర్యం యెంతగా ప్రదర్శించినా-ముందుంది కదా - ముసళ్లపండుగ!

పురోహితుడు, శ్రీమన్నారాయణగారి, వయిపుచూస్తూ: “మీ అభిప్రాయం సెల వివ్వండి”-అన్నాడు...

“సెల విచ్చటానికేం వుంది...? వారికి నాపరిస్థితులు తెలుసు .... ఉదారహృదయం గల పెద్దలు వారు. నే వారి అంతస్థుకు తగిన వాడ్ని కాను. కానీ నాబిడ్డ భవిష్యత్తు కోసం”-శ్రీమన్నారాయణగారింకా యేమిటో చెప్పబోతూంటే - పున్నయ్యగారు, యింత క్రితంవరకూ, చూపిన, ఓర్మి, సహనం, యేలా మాయం చేసుకొన్నారోగాని, కటువుగా: “ఆ సంగతులన్నీ మిమ్మల్ని యిప్పుడెవరడుగుతున్నారండీ?.... మేం అడిగేది.. కట్నకానుకల విషయం” - అన్నాడు కచ్చితంగా!

శేషగిరీ, శ్రీమన్నారాయణగారూ. కూడా ఆయనమాటలకు తెల్లబోయారు,

శ్రీమన్నారాయణగారు: "చిత్తం!...మీరు ఆదర్శవాదులని.... కట్నినిషేధాన్ని గురించి, ఉపన్యాసాలిచ్చేవారనీ, కట్ననిర్మూలనకు ప్రయత్నించినవారనీ నాకు తెలుసు... మీలాంటి ఆదర్శవాదులబాంధవ్యం వాంఛించటంకంటె యీ బీదవాడు కోరేదేమిటి? ఏదో లాంఛనాలకు..." అని, యింకా యేమో చెప్పబోతూంటే—

"అవి యెప్పటిమాటలో! ఇప్పుడా గొడవ లవసరంలేదు. నాకున్న ఆస్తిపాస్తుల సంగతి మీకు తెలుసుననుకుంటా ... నా కొడుకును చూశారు... ఇక మీఅభిప్రాయం తేల్చండి..."- అన్నాడు పున్నయ్యగారు.

ఇంత కచ్చితంగా, ఆయన అంటూంటే-మరోమారు - శ్రీమన్నారాయణగారు, తెల్లబోవటంకంటె చేయకలిగిందేమీ లేకపోయింది!

కొద్దినిముషాలు నిశ్శబ్దంగా గడిచాయి...

"ఏమండీ ఏమీ మాట్లాడరు?"

"ఏదో బీదవాడ్ని...మీరూ ఆదర్శవాదులు...కట్నంగానూ, కానుకలు గానూ, పెద్దగా యివ్వలేను. వాటికంటె విలువైన-మా పార్వతిని మీ కప్పచెబుతున్నాను.. ఏదో...అయిదు వేలు..."-

"అయిదు వేలా? ముష్టాడికి వస్తున్నాయి అయిదు వేలు. ఎంత లేనివాళ్ళయితేమట్టుకు-మేం ఎంత ఆదర్శవాదులమైతేమట్టుకు—ఏదో లాంఛనప్రాయంగా- మేం కట్నం స్వీకరించితేమాత్రం-మా ఆస్తిపాస్తులసంగతి గుర్తించకుండా-ముష్టి అయిదు వేలనటమా? అదేమీ బాగోలేదు. మరేమయినా చెప్పేది వుందా?"-తీవ్రంగా పున్నయ్యగారనటంతోటే—

శ్రీమన్నారాయణగారు నిర్ఘాంతపోతూ "తామే సెలవివ్వండి"-అన్నాడు.

పున్నయ్యగారు, ఒక్కమారునవ్వి: "అ...అలా దారికి రండి బావగారూ... నేనెప్పుడో ఆదర్శవాది నయ్యాననీ-దాన్నింతవరకూ-అంటిపెట్టుకు, కూర్చున్నాననుకున్నారా? లేదు. ఆదర్శాలు అప్పుడే నశించాయి. నిజానికిచూడండి, ఇప్పట్లో, కట్నం తీసుకోకుండా యెవరు పెళ్ళిచేసుకుంటున్నారు?"-అన్నాడు.

"చిత్తం"-అంతకంటె శ్రీమన్నారాయణగారేం అనగలుగుతాడు?

"మీ పార్వతి, మాకు నచ్చింది; మా అబ్బాయికూడా మక్కువచూపిస్తున్నాడు. ఇంతక్రితం, అయిదారుసంబంధాలు చూశాం. ఏవీ నచ్చలేదు. కానీ నేటికి, యిదిమాత్రం మీ అదృష్టంకొద్దీ - మా అదృష్టంకొద్దీ నచ్చటం జరిగింది. అంగవల - యెందు వాళ్ళు యిస్తామన్నది మీరు యివ్వాయండి. ఆ పరతుల కొప్పుకుంటే-కొద్దిరోజుల్లో నే - వివాహం మనం చేసేయవచ్చు."

"చిత్తం"-అన్నాడు శ్రీమన్నారాయణగారు.

"సరి. మన షరతులు చెప్పండి పంతులుగారూ" అని పురోహితుడితోఅని, తిరిగి తనతు తానే: "నేనే చెబుతాలెండి"అంటూ శ్రీమన్నారాయణగారి వయిపు తిరిగి, పున్నయ్యగారిలా చెప్పాడు: "శరభరాజువారి అమ్మాయి - జూనియరు - ఇంటరుమీడియేటు చదువుతోంది, కొంచెం నలుపు. పదివేలు యిస్తామన్నారు. ఆ పదివేలూ యివ్వటానికి మీరు అంగీకరిస్తారా? ఆ పిల్ల నలుపు కాబట్టి వదలివేశాం. మీ అమ్మాయి మాకు నచ్చిందికనుక-ఆ కట్నం కనుక యిస్తే...మాకభ్యంతరంలేదు."

మిత్రుడు సుదర్శనం చెప్పినమాటలు - యిప్పుడు శ్రీమన్నారాయణగారిబుఱ్ఱనిండా వున్నాయి. అయితే పున్నయ్యగారు -గత చరిత్రలలో ఆదర్శంచూపించినా, ప్రస్తుతం చూపించ తలబోయటంలేదు. "కట్నం కనుకయిస్తే..." అని ఆయన అంటున్నాడు గనక-మరి గొడవలేకుండా - వివాహం నిశ్చయం అయిపోతుందేమో ... ఇంతవరకూ-సుముఖంగా-నడచినమాటలు-తాను సాధ్యం కాదంటె విముఖం అయిపోతాయి.

అందువల్ల ఆయన ఏలాగో "చిత్తం... ఆడపిల్లలుకలవాడ్ని...తమ అభిమానం వాంఛిస్తున్నాను" అన్నాడు.

పున్నయ్యగారు చిరాకుగా "మీరు పదివేలూ యిస్తారా యివ్వరా?" అని అడిగాడు.

శేషగిరి తండ్రిమాటలు తనకు నచ్చనట్లుగా పైకి కనపడుతున్నా, కిమ్మనక వూరుకొన్నాడు.

శ్రీమన్నారాయణగారు, గుమ్మంలో నిల్చున్న భార్యవైపుచూశాడు. ముందు భవిష్యత్తుసంగతి యేమాత్రం యోచనచేయకుండా "ఒప్పుకోండి" అన్నట్లుగా-సంజ్ఞలు చేసింది జ్ఞానాంబ.

శ్రీమన్నారాయణ "సరి" అన్నాడు.

"ఒప్పుకున్నట్లేనా?" పున్నయ్యగారి ప్రశ్న అది!

"ఒప్పుకొన్నానండి.. మరి నన్ను బాధపెట్టకండి" — ప్రాధేయపూర్వకంగా అన్నాడు శ్రీమన్నారాయణగారు.

పున్నయ్యగారు చి ... నవ్వుతూ: "బాధపెట్టడానికేముంది ..లాంఛనాలు ఏలాగూ తప్పవుకదా" అన్నాడు!

తిరిగి శ్రీమన్నారాయణగారి గుండె గతుక్కుమంది: "అవేమిటో" అన్నాడేలాగో, ఆయన - లక్ష్మీదేవమ్మ నవ్వుతూండగా—

"అవేం పెద్దగా వుండవులెండి. పెండ్లికుమారుడికి పట్టుబట్టలూ, వెండిచెంబూ, వెండికంచం, వెండిపాంకోళ్ళూ - వియ్యపురాలి లాంఛనాలక్రింద మరో వెయ్యినూటపదహార్లు, నూతనవస్త్రాలు, ఇంక పెండ్లికుమారుడికి యివ్వటానికి ఒక మోటారుసైకిలు..." పున్నయ్యగారిలా చెబుతూంటే—

"నాకేం అవసరం లేదు"— అన్నాడు శేషగిరి!

పున్నయ్యగారు, మూతి, ముటముటలాడిస్తూ "అవసరం లేకపోవటం యేమిటే? అవన్నీ లాంఛనాలు. మనకు కావలసినా, అక్కరలేకపోయినా యిటువంటి సమయంలో వాళ్ళను అడుగుతూండాలి నీ మంచిచెడ్డలు నాకు తెలుసు. మరి మాటాడకు"— అన్నాడు.

శేషగిరి మరి మాట్లాడలేకపోయాడు!

"ఏమంటారు. మరిచా...ఒక రేడియో"-

"నేను పిల్లలు కలవాడ్ని...మీరు నాయెడ దయ చూపించాలి"

లక్ష్మీదేవమ్మ యీ మాటలు విని, భర్తవయిపు ముట, ముట చూసింది. ఆయన, మరింత కటువుగా: "మీరు పిల్లలు కలవాళ్ళయితే మేం యేం చేయమండీ...మా సంబంధం కావలసి వచ్చినప్పుడు — మా

కోర్కెలన్నీ చెల్లించాల్సిందేకదా”— అన్నాడు.

ఏం చేయాలో తెలియని స్థితిలో— శ్రీమన్నారాయణగారు భార్యవైపు చూశాడు. ఆవిడ భర్తను రమ్మన్నట్లుగా చేసంజ్ఞ చేసింది. దిగులుగా—పున్నయ్యగారివంక చూస్తూ, లోపలికి వెళ్ళాడు శ్రీమన్నారాయణగారు..

జ్ఞానాంబ ఆయన్ననుసరించింది... ఇద్దరూ కలసి దొడ్లోకి వెళ్ళారు...

“ఏమిటి యింకా ఆలోచిస్తున్నారు... పదివేల కట్నం యివ్వటానికంగీకరించారుగా.”

“ఊఁ”

“మరి లాంఛనాలదగ్గర- ఆగిపోయారేం.. మీ పెళ్ళికొడుక్కు అయినా - అవి యివ్వవలసినవేగా.”

“ఈ పదివేలూ ఎక్కడినుంచి తేవటమా అనుకుంటూంటే — ఈ లాంఛనాలు, మరెక్కడ్నించి తేసుకురాగలనే? మన అదృష్టంకొద్దీ - కట్నం లేకుండానే - సంబంధం నిశ్చయం అవుతుందేమో ననుకుంటే - అది యీవిధంగా తయారైంది. నాకేం తోచటంలేదు”—ఈలా శ్రీమన్నారాయణగారంటూంటే:

“ఇంతకూ నచ్చిన సంబంధం - అబ్బాయి బాగున్నాడు....ఏదో విధంగా చూసుకోవచ్చు...‘సరి’ - అనండి. ఇంత వున్న కుటుంబం. ఒక్కగానొక్క కొడుకు”— జ్ఞానాంబ, కూతురు భవిష్యత్తు, ఆలోచిస్తూ అంది.

“నాకేం అర్థంకావటంలేదు...”—



అంటూ యింట్లోకి శ్రీమన్నారాయణగారు వస్తూంటే, వెలుపలిగుమ్మంప్రక్కన వెక్కి వెక్కి యేడుస్తూ, నిల్చున్న పార్వతి ఆయనకు కన్పించింది...

శ్రీమన్నారాయణగారి గుండె బేజారయిపోయింది. మేకపోతుగాంభీర్యం వహించివున్న ఆయన ఒక్కసారిగా అణిగిపోయాడు...

“ఏం..ఎందుకమ్మా...ఏడుస్తున్నావ్?” అని అడిగాడాయన!

“నాన్నా యీ సంబంధానికి మీరు ఒప్పుకోవద్దు”—

“ఏం...” - నిర్ఘాంతపోతూ, అన్నాడు శ్రీమన్నారాయణగారు.

“ఇష్టంలేదు” - బొంగురుపోయిన కంఠం నుంచి - ఇది పార్వతి జవాబు.

“అబ్బాయి నీకు నచ్చలేదా?”

“అబ్బాయి నచ్చలేమాత్రం...నాన్నా! ఆ అబ్బాయికోసం..ఆ తండ్రి కోరే కట్నం నాకు నచ్చలేదు...నా సుఖంకోసం - మీరా కట్నం యిచ్చినా - నే నాయన్ని పెండ్లిచేసుకోను... రేపు - అంత కట్నం యిచ్చి పెండ్లిచేసిన తరువాత, మీ గతేం కాను నాన్నా? చెల్లెళ్లకు పెళ్ళిళ్లు చేయనవసరం లేదా?”—పార్వతి యీలా అంటూంటే శ్రీమన్నారాయణగారి కామె వుద్దేశం అర్థమయింది.

ఆయన, “ఛా పిచ్చిపిల్లా! వాళ్ళ భవిష్యత్తుకేం.. దక్కగా వుంటుంది...నీకిప్పుడు చూస్తున్న విధంగా నే వాళ్లకూ తగిన సంబంధాలు చూస్తాను..మనకేం - నువ్వేం దిగులు పడకు” అంటూ - ఒకమూల పార్వతి ఏమో చెబుతున్నా, వినిపించుకోకుండా, బయటకు వచ్చేశాడు... తెల్లబోతూన్న పార్వతి తండ్రి, వెనుకనే, కన్నీళ్లు తుడుచుకుంటూ, గుమ్మం దగ్గరకు వచ్చి గుమ్మంచాటునుండి- వాళ్ల సంభాషణ వినసాగింది:

“ఏమండీ .... మాకు బండి టయిమవుతోంది...”-అన్నాడు-పున్నయ్యగారు.

“ఈపూట మీరు వెళ్లడానికి వీల్లేదు”— పామరస్వపరిష్కారంకోసం, ప్రయత్నించే వ్యక్తి విధంగా అన్నాడు శ్రీమన్నారాయణగారు.....పున్నయ్య నవ్వాడు: “అవన్నీ తర్వాత... ముందేం చేశారు... లాంఛనాలు యివ్వటానికి అంగీకరించినట్లేనా?”—

“నా స్థితిగతులు పూర్తిగా మీకు తెలుసు. మీబోటివారితో, తూగేశక్తి నాకు లేకున్నా ఆదర్శవాదులని - మిమ్మల్ని గూర్చి అనేకమంది చెప్పివుండటంచేత - మిమ్మల్ని అభ్యర్థిస్తున్నాను... మీరు కోరినకట్నం యిస్తున్నానుకనుక - అదే నా శక్తికి మించినది గనుక - దయయుంచి అనుగ్రహించండి” -

పున్నయ్యగారికి మిక్కుటంగా కోపం వచ్చేసింది. “నే అడిగేదేమిటి? మీరు చెప్పేదేమిటి?” - అన్నాడాయన.

శేషగిరి తండ్రివయిపు చూసి, మూతి ముటముట లాడించాడు.

శ్రీమన్నారాయణగారు “క్షమించండి - మీరడిగే లాంఛనాలకు బదులుగా ఒక వేయి రూపాయలు ముట్టచెప్పుకుంటాను. అన్యథా భావించక అంగీకరించండి” అన్నాడు.

“ముష్టి వేయిరూపాయలు” అంది లక్ష్మందేవమ్మ.

“డబ్బు యెవరికి కావాలండీ.లాంఛనాలు గానీ” - అన్నాడు పున్నయ్యగారు.

పురోహితుడు: “అవునంటూ” పున్నయ్యగారి మాటలతో శృతి కలిపాడు. ఆయన నామమాత్రంగా వచ్చినా, మంచి చెడ్డలు మాట్లాడుకునే వ్యక్తి పున్నయ్యగారే అయ్యాడు!

“నాకష్టసుఖాలు మీరేం గుర్తించరన్న మాట? నా మనవి మీకేం అవసరం లేదన్న మాట? మీరు కూడా ఆడపిల్లల తల్లిదండ్రులయివుంటే - కొద్దిమాత్రంగా నయినా — సాధకబాధకాలు అర్థం అయివుండేవి” — చివరకు శ్రీమన్నారాయణగారిలా ఉద్రేకంతో అంటూంటే—,

“మీ సాధకబాధకాలు నాకెందుకండీ” అని వెక్కిరింపుగా నవ్వాడు పున్నయ్యగారు.

శ్రీమన్నారాయణగారికి వుద్రేకం పెరిగింది. “సరి....మీరడిగిన కట్నకానుకలు యివ్వడానికి నే సిద్ధపడ్డాను. ఇంకా ఏమయినా వున్నాయా....ఊఁ కానివ్వండి”— అన్నాడు పిచ్చివాడిలాగ!

“మరేంవున్నాయి ... మా లాంఛనాలు మీరూ యిచ్చుకుంటాం. వైభవంగా పెండ్లి చేసుకుంటాం. రెండు వందల దాకా మా బంధువులు వస్తారు ... అందరినీ తగిన విధముగా గౌరవం చేయాలి. మరి ముహూర్తం నిర్ణయించుకోటమే తర్వాయి” అంటుంటే-

“ఆగండి” - అంటూ ఎఱ్ఱబడినవదనంతో కళ్ళతో - పార్వతి వేగంగా అక్కడికి వచ్చి, అక్కడివాళ్ళంతా తెల్లబోతుంటే శ్రీమన్నారాయణగారు, “లోనికి వెళ్లిపోమ్మా—” అని వారించుతూ ఉంటే పున్నయ్యగారివయిపు చూస్తూ “నమస్కారం. అవబోయే మామగారూ...మీ షరతులన్నీ అయిపోయాయా? ఇంకా వున్నాయా?” అని అడిగింది. శేషగిరి పార్వతివైపు చూస్తున్నాడు. లక్ష్మందేవమ్మ, తదితరులు తెల్లబోతున్నారు. నిర్ఘాంతపోతున్న పున్నయ్య

గారు, యెలాగో చిన్నగా నవ్వి, "ఆ అయిపోయాయమ్మా" - అన్నాడు.

"నేను మీకు నచ్చానా?"

"దివ్యంగా."

"మీ అబ్బాయికి?"

"వాడికి నువ్వు యెప్పుడో నచ్చావ్" అంటూ పున్నయ్యగారు కొడుకువయిపు చూశాడు. శేషగిరి అయోమయ పరిస్థితిలో తలదించుకొన్నాడు.

"ఏమండీ అత్తగారూ మీకు?"—

"నాకూ నచ్చావమ్మా" - అంది లక్ష్మీందేవమ్మ, తెలతెలబోతూ!

"మరయితే నన్ను మీ అబ్బాయికిచ్చి వివాహం చేస్తారా?"

"ఓ దివ్యంగా... మీ నాన్నగారు — కట్నం యివ్వటానికీ - లాంఛనాలు యివ్వటానికీ అంగీకరించారుగా... మరి ముహూర్తము పెట్టించుకోటమే తరువాయి. నువ్వు మాయింటి కోడలవయిపోతావు" పున్నయ్యగారు ఒకమూల గుండె దడదడలాడుతూండగా అంటూంటే—

"ఒకమాట" - అంది పార్వతి.

"ఏమిటది?" - పున్నయ్యగారు పార్వతివయిపు చూశాడు.

"నేను మీకు నచ్చినప్పుడు కట్నకానుకలలో నిమిత్తమేమిటి?"

"కట్నకానుకలతోనూ - లాంఛనాలతోనూ - నువ్వు మాకు కావాలి."

"అవి లేకుంటే నేను మీకు అవసరం లేనుకదూ?"

పున్నయ్యగారు మౌనంగా వూరుకొన్నాడు.

"తప్పమ్మా! తప్పు...మనం అలామాట్లాడకూడదు"-అని శ్రీమన్నారాయణగారు, పార్వతిని వారించుతున్నా అక్కడికి వచ్చి జ్ఞానాంబ కళ్లనీళ్లు పెట్టుకొని, నెమ్మదిగా యేడుస్తున్నా వాళ్ళను లక్ష్యపెట్టకుండా—

"అయితే...వచ్చినదారినే తాము తప్పుకదయచేయవచ్చు" -అంది...పున్నయ్యగారు నిర్ఘాంతపోతూ: "అదేమిటి?"-అన్నాడు.

"మీరు నన్ను కట్నకానుకలతో...మీ కోడల్ని చేసుకుందామనుకుంటున్నారు. మీ అబ్బాయిమీద నామనసు నిలచింది. కానీ కట్నకానుకలు పుచ్చుకొని 'ఆదర్శవాదు'లనిపించుకోనే - మీబోటి పెద్దలకు కోడలవటం నాకిష్టం లేదు. కట్నం పుచ్చుకొనకుండా నన్ను మీకోడలుగా గ్రహించినా సరే లేకుంటే ..'-ఈవిధంగా వుద్రేకంతో పార్వతి యింకా యేమిటేమిటో అనబోతూంటే - జ్ఞానాంబ, తదితర ముత్తయిదువులూ, ఆమెను బలాత్కారంగా అక్కడనుంచి తీసుకుపోయారు ..శ్రీమన్నారాయణగారు: "ఏదో పుట్టింది...నోటికి వచ్చినట్టుగా అంది. మరోవిధంగా భావించకండి, "అని బ్రతిమాలుతూంటే- జ్ఞానాంబ, తిరిగివచ్చి, లక్ష్మీందేవమ్మకు నచ్చచెప్ప ప్రయత్నిస్తూంటే - శేషగిరి, దిగాలుగా వాళ్లవయిపు చూస్తూండగా - పురోహితుడు - తెల్లబోతూంటే—

పున్నయ్యగారు, తెచ్చుకొన్న కోపంతో: "చేసినగౌరవం చాలులేవయ్యా. పొగరుబోతుపిల్ల. పెద్దా పిన్నా తారతమ్యం లేకుండా మాట్లాడింది. మరి నీ గుమ్మంలో నిల్చోటానికిగూడా అర్హత లేదు. ఊ నడవండి" - అంటూ - ఏదో చెప్పబోతున్న - శేషగిరిని, రెక్కపట్టుకు బయటకు ఈడ్చుకుపోయాడు. లక్ష్మీందేవమ్మ: "ఈ మహాశక్తి నాకు కోడలేమిటి" - అంటూ బయటకు వచ్చింది.

"అమ్మాయిని నేను"- అని శేషగిరి బయటకువస్తూ అనబోయాడు - కానీ ఏమాత్రం అతిగాడ్ని లక్ష్యపెట్టకుండా - పున్నయ్యగారు లాక్కుపోయాడు!

ఆనందంతో. వుండవలసిన కుటుంబం దుఃఖసముద్రంలో నిండిపోయింది! వాళ్లు స్టేషనుకు వెళ్ళిపోయారు!

"ఏమయినా ఆడపిల్ల అలా మాట్లాడవచ్చునా? ఈ సంగతి తెలిస్తే మరెవళ్ళయినా చూడటానికి వస్తారా?" - అని అక్కడి అమ్మలక్కలు బుగ్గలు నొక్కుకున్నారు.

జ్ఞానాంబా, శ్రీమన్నారాయణగారు — "అంతా మాకర్మ" - అని కళ్ళనీళ్లు పెట్టుకొన్నారు.

"వాళ్లమాటలు నాకు- వుద్రేకం తెప్పించాయి. అనేశాను"-అంటూ పార్వతి యేడుస్తూంది.

* * *

తర్వాత ఒక వారంరోజులు భారంగా గడిచాయి ...

ఏదో సంబంధంచూసి - పార్వతికి త్వరలోనే వివాహం చేసేయాలనే నిశ్చయానికి వచ్చిన శ్రీమన్నారాయణగారు - ఈ వారంరోజులూ తెగతిరిగాడు...పార్వతినిగురించి అనోటా ఆనోటా వచ్చినమాటల మూలంగా

 

# పార్వతి



శ్రీమన్నారాయణ గారి ప్రయత్నాలు చాలావరకు విఫలమయ్యాయి. పెండ్లికూతురుని చూడటానికి గూడా - పెళ్ళి పెద్దలు రావటంలేదు. విసిగి వేసారిన శ్రీమన్నారాయణగారికి అతుకులబొంత సంబంధం వొకటి తారసపడ్డది ... వరుడు స్కూలుఫైనలు మూడోమారు చదువుతున్నాడు; ఆస్తిపాస్తులు వాళ్ళకు పెద్దగా లేవు: కానీ కట్నం మాత్రం అయిదువేలు కావాలిట; పైగా లాంఛనాలు.

"ఏదో ఒక సంబంధం. యేదో ఆస్తి వున్నదిగదా" అనుకొని,

"సరే...అమ్మాయిని చూసుకోటానికి రండి" అని వాళ్లతో ఆయన చెప్పాడు.

"ఫలానా - నాటిబండికి మేం రాగలం. స్టేషనుకు రండి" అని వాళ్లు చెప్పారు.

"చిత్తం...మరచిపోకండి" అని శ్రీమన్నారాయణ తిరిగి యింటికి వచ్చాడు.

* * *

మరి రెండురోజులు గడిచాయి...

పార్వతిని చూసుకోటానికి ఆ దినమే పెళ్ళివారు వస్తారు. శ్రీమన్నారాయణగారు, కలసిన యేర్పాట్లు చేసి—పార్వతిని జాగ్రత్తగా మసులుకుపోవలసిందని హెచ్చరిక చేసి, వారి నాహ్వానించటానికి స్టేషనుకు వెళ్ళాడు.



రైలు వచ్చింది. హారు బండి దిగారు ...

"వచ్చారా" - అని ఆప్యాయతతో అత్తవారి వియ్యంకుడిని పలకరించాడు శ్రీమన్నారాయణగారు.

"ఆ...మీతో కొంచెం మాటాడాలి..." అన్నాడాయన.

"ఇంటికి పోతున్నాముగా."

"పోకుండానే మాటాడాలి ... అలా ముందుకు నడదాం" - అంటూ అతవారి వియ్యంకుడు పెళ్లికుమారుడిని అక్కడ వదలి, శ్రీమన్నారాయణగారిని, దూరంగా తీసుకుపోయాడు...

ఇద్దరూ - ప్లాటుఫారంమీద నిర్మానుష్యమైన ప్రదేశంలోకి వచ్చారు.

"ఏమిటి?—" శ్రీమన్నారాయణగారడిగారు.

"మీ అమ్మాయిని గురించి—"

"ఊ...ఏమిటి?" - గుండె దడ దడలాడుతూంటే, తెల్లబోతూ అడిగాడు శ్రీమన్నారాయణగారు....

"మీ అమ్మాయి పొగరుబోతుపిల్లట... మగవాళ్లతో యెదిరించి మాట్లాడుతుందట. నాతో నలుగురయిదుగురు చెప్పారు."

శ్రీమన్నారాయణగారికి నోట్లు ముండిపోయింది కానీ యేలాగో తమాయించుకొని: "మీరు చూస్తారుగా ... అవన్నీ వుత్తుత్త మాటలు. నేనంటే కిట్టనివాళ్లు చెప్పే అసత్యపు మాటలు" అన్నాడు...

"ఏమయినా నా కభ్యంతరం లేదనుకోండి ...కానీ"—

"మరేమిటి"

"మీ అమ్మాయి యెట్టితరహాపిల్లయినా... మరో వేయిరూపాయలకట్నం యెక్కువయిస్తే - నిశ్చయించుకోటానికి మా కభ్యంతరంలేదు."- అన్నాడాయన

శ్రీమన్నారాయణగారి కీమాట నిజంగా నోట్లు ముంచిపోయింది:

"అమ్మాయి ఎదిరింపులకూ, పొగరుబోతుతనానికీ- ఈకట్నానికీ లంకె అన్నమాట!"- అన్నాడు!

వియ్యంకుడు నవ్వుతూ: "ఆ..." అన్నాడు.

శ్రీమన్నారాయణగారు కోపంతో: "అయితే మీరు...మరి ముందుకు దయ చేయవలసిన అవసరంలేదు. వచ్చినమార్గానే దయ చేయండి" అంటూ — తిరిగిచూడకుండా యింటికి నడిచాడు.

* * *

కోపంతోనూ - వేగంతోనూ - శ్రీమన్నారాయణగారు ఇంటికి వచ్చి, "అంతా మన అదృష్టం. ఇక ఈ జన్మలో దానికి పెళ్ళి వదు. పొగరుబోతుపిల్లఅనీ, ఎదిరించేదనీ— నాడవాడెలా ప్రాకిపోయింది" అని పళ్ళు పట, పట లాడిస్తూంటే—

జ్ఞానాంబ యేమీ అర్థంగాక తెల్లబోతూంటే—

గదిలో పార్వతి వెక్కి వెక్కి యేడుస్తూండగా—

పున్నయ్యగారి పురోహితుడు, అప్పుడే రైలుబండి దిగి అక్కడికి వచ్చి: "నన్ను పున్నయ్యగారు పంపించారు" అంటూ ఒక కవరిచ్చాడు.

జ్ఞానాంబ...అర్థంగాని పరిస్థితిలో భర్తవయిపు చూస్తూండగా—

శ్రీమన్నారాయణగారు, ఆదుర్దాతో కవరు చించి, అందలి విషయాలు చదువుకొని, ఆనందం వ్యక్తపరుస్తూ "ఏలాగయినా మా పార్వతి అదృష్టవంతురాలు" అన్నాడు.

"ఏమిటండీ?" అని జ్ఞానాంబ ఆదుర్దాగా భర్తవయిపు చూసింది.

"మనం అదృష్టవంతులం...కొడుకు శేషగిరి పట్టుదల కారణంగా, పున్నయ్యగారు ఏమాత్రం కట్నం తీసుకోకండా మన పార్వతిని కోడలుగా స్వీకరించటానికి అంగీకరించారు. పార్వతిని తప్పించి మరే పిల్లనూ కట్టువాడు పెండ్లి చేసుకోనన్నాడట. అందువల్ల కట్నకానుకలమీద ఆశ వదలి, మన పార్వతిని వారి కోడల్ని చేసుకోటానికి పున్నయ్యగా రంగీకరించారు. ఈ సాయంకాలమే తాంబూలాలు పుచ్చుకోటానికి, ముహూర్త నిశ్చయం చేసుకోటానికి వారు బయలుదేరి వస్తున్నారట..." అని సంతోషంతో శ్రీమన్నారాయణగారు చెబుతూంటే—

"ముందు యేర్పాట్లు కలసినవి చేసుకోమని చెప్పటంకోసం, పున్నయ్యగారు నన్ను పంపించారండి" అని చెప్పాడు, పున్నయ్యగారి పురోహితుడు.

ఇంకేముంది!

"ఎంత అదృష్టం! ఎంత అదృష్టం" అని జ్ఞానాంబా, పిల్లలూ, మురిసిపోతూంటే—

గదిలోవున్న పార్వతికళ్లలో నీళ్ళు నిలచాయి. అవి శోకాశ్రువులు కావు, ఆనంద బాష్పాలు.

అవి కోరినవ్యక్తి భర్తగా లభ్యమయినందుకు కాదు—

తన ఆశయాలకు అనుగుణంగా—

కోరినవ్యక్తి కట్నకానుకల వాంఛ లేకుండా, తన్ను వివాహం చేసుకోబోతున్నందుకు. 



# మిత్రలాభం



కష్టాలన్నీ తన ఒక్కడికే వచ్చిన ట్లతను మొగం పెట్టేడు. ఈ విపత్కర పరిస్థితిని తట్టుకోవడ మెలాగా అని అత డాలోచిస్తున్నాడలే వుంది. అతడి ముఖంలో కొంతి రేఖ లుద్భవించేయి అతనికి కొత్తగా పుట్ట బోతున్న ఆలోచన తాలూకూ వస్తుతత్వాన్ని ఆలోచించడానికి కూడా భయంగా వుంది.

"అయితే నువ్వోక పని చెయ్యి. సముద్ర పొడ్డు గ్రామాల్లో ఏదో ఒకదానిలో కొంత కాలం నా ప్రతినిధిగా వుండు. నా తరఫున అక్కడ కార్యాలయం పెట్టి ప్రచారం చెయ్యి. కావలసిన ఏర్పాట్లునే చేస్తా" అని ఆశగా నావైపు చూసేడు. ఆలోచించి చెబుతా నన్నాను.

అతను వెళ్ళిన మరో అరగంటకు రెండో మితుడు వచ్చేడు. నా పరిస్థితంతా చెప్పి డాక్టరు గాలిమార్పుకు సముద్రతీరపు గ్రామాలకు వెళ్లమన్నాడని చెప్పాను. మా మిత్రుడు గొప్ప అనుభవం వున్న డాక్టరులాగ మొగం పెట్టి:

"ఏజెన్సీ గాలికి, సముద్రం గాలికి పడ" దన్నాడు. ఏటితీరపు గ్రామాల్లో అయితే మంచి దన్నాడు. అక్కడొక్క గాలివల్లే కాక ఏటినీటివల్ల కూడా వ్యాధి నివారింప బడుతుం దన్నాడు. తన తరఫున వెళ్తే నా ఖర్చులన్నీ భరించి, మనిషిని కూడా తోడిస్తా నన్నాడు. అతనితో కూడా ఆలోచించి చెబుతా నన్నాను. వీళ్లిద్దరూ కూడా ఒక పట్టాన నన్ను వదిలేటట్టు లేరు.

మా అన్నగారు నన్ను రమ్మని వ్రాసిన ఉత్తరం అందగానే చడీచప్పుడూ లేకుండా ఒక సాయంత్రం ప్యాసింజరులో మా అన్నగారి వూరు వెళ్ళిపోయాను. మా అమ్మతో మాత్రం వాళ్ళెవరైనా వచ్చి అడిగితే మళ్ళీ జ్వరం తిరగవేస్తే రాత్రికి రాత్రి వాళ్లన్నయ్య వచ్చి తీసుకుపోయాడు. వీలైనంత త్వరలోనే మళ్ళీ వచ్చేస్తాడని చెప్పమన్నాను.

*　　*　　*

మా అన్నగారి వూర్లో కూడా ఎన్నికల జ్వరం విస్తారంగానే వుంది. నన్నెవరికీ తెలియదు కాబట్టి ఎవరూ నన్నటే బాధించేవారు కారు.




నేను ప్రొద్దస్తమానం వీధిగదిలో కూర్చొని చదువుకొనేవాడిని. మేమున్న ఇంటి కెదురుగుండా ఒక శెట్టిగారు ఉండేవారు. ఆయన కావూర్లో కిరాణాకొట్టు, వడ్డీవ్యాపారం వున్నాయి. కొట్టు వాళ్ళ పెద్దబ్బాయి చూసుకుంటున్నాడు. శెట్టిగారు మాత్రం ఇంటి దగ్గరే వుండి వడ్డీవ్యాపారం చూసుకునేవారు. శెట్టిగారింటికి కనీసం రోజూ రెండు, మూడు కార్లేనా వచ్చేవి. వాటిపైనున్న జండాలనుబట్టి అవి ఎన్నికల ప్రచారపు కార్లని పోల్చుకున్నాను. శెట్టిగారు కూడా నాకు మల్లే ద్వంద్వంలో పడి ఇరుక్కున్నారు కామోసు పాపం!

రోజూ కార్లువచ్చేవి. శెట్టిగారు మాట్లాడిన తర్వాత అభ్యర్థులను వీధివరకూ సాగనంపి కారులో కూర్చున్నతర్వాత శెట్టిగారే కారుతలుపు వేసేవారు. ఆయన మొగంలో ఏవిధమైన ఆందోళనా వుండేదికాదు.

రోజూ రెండుమూడు రకాల పార్టీ మనుష్యులను ఆయన సుళువుగా నవ్వుతూ ఎలా సాగనంపేవారా అని నాకాశ్చర్యం వేసేది. శెట్టిగారిలో ఏదో అపూర్వమైన శక్తి ఉండిఉండాలి. శెట్టిగారు రానురాను పరిచయం కావలసిన వ్యక్తిగా కన్పించేరు. మెల్లిగా కత్తు కలిపేను "మీ రేపార్టీ" అని. శెట్టిగారు నవ్వుతూ "టీపార్టీ" అన్నారు. శెట్టిగారి మొగంచూస్తే ఇప్పటి ప్రపంచ సమస్యల్లో ఏ సమస్య అయినాసరే ఆయనకు సునాయాసంగా పరిష్కరించే య్యగలరనిపించింది.

సంభాషణ ఆగిపోయింది. మళ్లీ ఏ ప్రశ్న వెయ్యాలి అన్న ఆలోచన కల్గింది. నాఅంతర్యాన్ని ఇట్టే పసిగట్టగల మానసిక వేత్తలా నన్ను ఒక్కసారి తీవ్రంగా చూసి "మా ఇంటికి ఒకసారి దయచెయ్యండి" అన్నారు. నన్నింతవరకూ వయస్సులో నాకంటె పెద్దవారు ఎవ్వరూ కూడా "దయచెయ్యండి" అని పిలవలేదు. శెట్టిగారి మన్ననవల్ల ఆ పదానికి కొంత గాంభీర్యం చేకూరింది. నాకు ఒక సవాలులాగ కన్పించింది. నేను తలుపు చేరవేసి శెట్టిగారి అరుగుమీద వారిప్రక్కనే చాపమీద కూర్చున్నా.

ఈవిధంగా ఏర్పడిన మాస్నేహం ఎన్నికల నాటికి సుస్థిరస్నేహంగా మారింది. ఎన్నికల కారులుమాత్రం రోజూ వస్తూనేవున్నాయి. మరోసారి శెట్టిగార్ని వారే పార్టీ అని అడిగేను. ఈసారి ఆయన టీపార్టీ అనలేదు. "వ్యాపారం చేసుకునేవాడికి నాకు పార్టీలేమిటి బాబూ" అన్నారు.

నిజమే. నాబోటిగాడికి అయితే ఒక్క స్నేహానికే విఘాతం వస్తుందికానీ శెట్టిగారి లాంటివారికైతే అసలు వ్యాపారానికే దెబ్బతగుల్తుంది.

"ఇప్పటికి దేనికీ లోపంలేకుండా ఏదో విధంగా వెళ్ళిపోతూంది."

"మరి మీ రేపార్టీకిసహాయంచేస్తున్నారు?"

"అన్ని పార్టీలకూ."

శెట్టిగారి మాటలలో హాస్యం వెనుక కొంత నిజంవున్నట్టే అనిపించింది.

"నాలుగు పార్టీలకూ ఎలా సహాయం చేస్తున్నారు?"

"మరోసారి చెబుతా. ఇంకా మీ రీ గ్రామంలో ఎన్నిరోజు లుంటారు?"

"ఎన్నికల ఫలితాలు తెలిసేవరకూ" అన్నాను.

"కొంపతీసి మీరుగాని ఏ అభ్యర్థితరఫునైనా పనిచేస్తున్నా రేవిటి?"

"ఉహూ. అసలు ఈ నియోజకవర్గంలో పోటీచేస్తున్న అభ్యర్థుల పేర్లుగూడా తెలియవు."

"మరేం వచ్చేరు?"

"మా అన్నగా రున్నారని."

"అదో కారణం కావచ్చు. కాని అది ద్వితీయం. మీరు ఇక్కడికి రావడానికి మరో ముఖ్యకారణం ఉండిఉండాలి."

శెట్టిగారికి జ్యోతిషం తెలుసునన్నమాట! ఆయనదగ్గర ఏవిషయం దాచడానికి వీలులేదు. శెట్టిగారికి నేను ఇక్కడికి రావడానికి గల సిసలయిన కారణాలు చెప్పేను. శెట్టిగారు నావైపు జాలిగా చూసేరు. వా రలా చూడ్డం నాకిష్టంలేదు. కానీ నిత్యజీవితంలో జరిగే ప్రతీపనీ మన యిష్టానిష్టాల ప్రమేయం లేకుండా జరుగకూడదని సిద్ధాంతం లేదుగా! శెట్టిగారు నా మనోభావాన్ని కన్పెట్టి కొంచెం ఊరట కల్గించడానికే కాబోలు కొంచెం చిరునవ్వు నవ్వి 'మీరేం చదువుకున్నారు?' అడిగేరు.

ఈ ప్రశ్నతో శెట్టిగారు నా చదువుమీద సవాలుచేసినట్లనిపించింది. శెట్టిగారి దృష్టిలో నేను ఎలాగూ చిన్నచూపే చూడబడుతున్నాను. అనవసరంగా నా చదువునుకూడా ఈ రొంపిలోదింపి వాటి పరువునుకూడా తాకట్టు పెట్టడమెందుకు?

'నేనేం చదువుకోలేదు"

"నిజం చెప్పండి. మీ తరహాచూస్తే ఏదో పెద్ద చదువు చదువుకున్న వ్యక్తిలాగే కన్పిస్తున్నారు."

శెట్టిగారు నేను నిజంగా చదువుకోనివాడినని నమ్మితే మేడిపండు పద్యంలాగ పైన పటారం, లోన లొటారం అన్న చరణంలాగ పై మాటలోని అంతరార్థం వినిపిస్తున్నాది.

నే నన్న మాట వారు నమ్మకపోతే నువ్వు

దొంగవు. నువ్వేం చదువుకున్నావో నాకు తెలుసు నన్నట్లనిపించింది.

మొత్తంమీద శెట్టిగారు ప్రమాదమైన మనిషిలాగే కన్పించేరు. కోపం వచ్చి ఉప్పూ, మిరపకాయలు అమ్మడం చదువుకుంటున్నాం అందామనిపించింది. కాని అనలేకపోయాను.

"సిగ్గుపడకండి. చదువుకంటే అనుభవం గొప్పదని మీ అభిప్రాయమంటే, మీ చదువు గురించి మరో ప్రశ్న వెయ్యను. ఏమంటారు?"

మనస్ఫూర్తిగా కాకపోయినా ఈ వాదం ఇంతటితో తెముల్తుందిగదా అని ఒప్పుకున్నాను.

"భేష్! అది చదువుకున్న వాళ్ళనుంచి రావల్సినమాట. నిజం ఒప్పుకున్నారు."

శెట్టిగారి దృష్టిలో నేను పైకి చెప్పిన మాట సబబైనదేకాని, మనసులోని మాట కేసబబైనదన్నమాట. నేనన్నమాటే నాకు ముఖ్యమో, నా మనసే ముఖ్యమైనదో తేల్చుకోవలసిన సమయం వచ్చింది. ఎన్ని విధాల చూసినా మనసే మాటకన్న ముఖ్యమైనదని తోచింది. అంటే నే నన్నమాట ఉపసంహరించుకోవాలన్నమాట. అందువల్ల శెట్టిగారితో తర్కం మరీ పెంచుకోవాలి. ఈ తర్కంలో పడితే శెట్టిగారు మనస్సుకూ, ఆత్మకూ ముడిపెడతారు. మనస్సు, ఆత్మ వేరువేరు శక్తులా? లేక రెండూ ఒకటేనా! వీటిని చర్చిస్తే తెగబారెడు కాంప వుంది. అవి పలకని భాగవతాలు!

"మరోసారి కలుసుకుంటా" నని శెట్టిగారితో చెప్పి ఇంటిముఖం పట్టేను.

*   *   *   *

శెట్టిగారు ఒకనాడు నాతో తమ సహాయంలోని రహస్యం చెప్పేరు. ఏ అభ్యర్థి తన సహాయాన్ని అభ్యర్థిస్తే అతనికే తను సహాయం చేస్తామని చెప్పేరట. నలుగురు అభ్యర్థులు శెట్టిగారి సహాయాన్ని అభ్యర్థించేరట. కాబట్టి శెట్టిగారు నలుగురికీ సహాయం చేస్తామన్నారు.

"అదెలా?" అని అడిగేను నేను కుతూహలంతో.

"నిజానికి మన మెవరికైనా చేసే సహాయం ఏమీ ఉండదు. ఒకరికి అపకారం చెయ్యకపోవడమే మనం చేసే సహాయం. నలుగురితో ఏ ఒక్కరికి ప్రత్యేకించి ఉపకారం చేసినా మిగతా వారికి అపకారం చెయ్యడమే అవుతుంది. అప్పుడు మనకి ఒక మిత్రుడు, ముగ్గురు శత్రువులు తయారవుతారు. మిగతా ముగ్గురకు అపకారం చెయ్యకుండా వుండాలంటే మొదటివాడికి ఉపకారం చెయ్యకూడదు. అందువల్ల నలుగురి

తోనూ శత్రుత్వమో, మిత్రత్వమో పక్షపాతం లేకుండా వస్తుంది. దీనికో చిన్న కిటుక్కు వున్నది. నిజానికి మనం యెవ్వరి తరఫునా పనిచేయకుండానే ప్రతి అభ్యర్థీ మనం తనకే సహాయం చేస్తున్నట్లు నమ్మాలి."

"అంతకంటె ఎవరో గెలిచేవార్ని ఒక్కర్నే నమ్ముకుని అతనికే సహాయంచేస్తే తరువాత మీకే లాభంకదా?"

"ఊహూ! అది పూర్వపురోజుల్లో. పూర్వం కంట్రోలు ఉండేరోజుల్లో పెర్మిట్లకు ఎవరో ఒక అభ్యర్థిని నమ్ముకోవల్సి వచ్చేది విధిగా. కాని కంట్రోలు ఇప్పుడు లేవు పెర్మిట్లబాధలేదు. ఇప్పుడు మాకు కావలసింది హెచ్చుబేరం. పూర్వం వస్తువులు తక్కువగా దొరికేవి. డిమేండు జాస్తీ. నేడు వస్తువులు హెచ్చు, డిమేండు (బేరం) తక్కువ."

"మరి మిమ్మల్ని వారు నలుగురు నమ్మేరా?"

"భేషుగ్గా. నమ్మేలా చెయటం మనలో వుంది."

ఆ వేళ ఎన్నికలదినం. వీధులన్నీ జనసమ్మర్దంగావున్నాయి. శెట్టిగారు కొట్టుకు శెలవిచ్చేశారు. నన్నుకూడా వారితో రమ్మన్నారు. ఆ ఊర్లో నాలుగు బూత్‌లున్నాయి. శెట్టిగారు ప్రతిగంటకు ఒకసారి నాలుగు బూత్‌లూ తిరుగుతున్నారు. శెట్టిగారికి తారసిల్లిన ఒకరిద్దరభ్యర్థులు శెట్టిగారికి నమస్కారం పెట్టేరు. శెట్టిగారు తీరుబడిలేనివారిలాగ చిన్న చిరునవ్వునవ్వి తమ కార్యక్రమంలో లీనమయ్యేవారు. వివిధపార్టీలవాలంటీర్లు ఉన్నప్పుడు శెట్టిగారు వారిచుట్టూవున్న ప్రజతో "మీ వోట్లు వేసెయ్యండి. ప్రశాంతంగా పోలింగు ముగియడానికి సహాయం చెయ్యండి" అనేవారు.

శెట్టిగారు ఓట్లు వెయ్యండని చెప్తున్నారు. ఫలానావారికని మాత్రం కాదు. సాయంత్రం నాలుగుగంటలకు శెట్టిగారు మరోక్కొత్తరకం ప్రచారం ప్రారంభించేరు. పైమై పోతోందని ఓటర్లను తొందర చేసేరు. విశ్రాంతి తీసుకుంటున్న వాలంటీర్లను మరోగంట ఓపిక పట్టండని మందలించేరు. పోలింగు ముగిసేవరకు శెట్టిగారు ఓటు వెయ్యలేదన్న సంగతి నాకు గుర్తు రాలేదు. శెట్టిగారికి తమ ఓటు విషయం నేనే జ్ఞాపకంచేసేను. శెట్టిగారు పని తొందరలో తమ ఓటు వెయ్యడం మరచిపోయామన్నారు. పోలింగు అవగానే శెట్టిగారు వివిధపార్టీల కార్యస్థానాలకు వెళ్ళి ఆ అభ్యర్థి కనీసం పదివేల మెజారిటీతో గెలవడం తథ్యం అన్నారు.

అది ఓట్లు లెక్కించేరోజు. శెట్టిగారు ప్రాతఃకాలానే లేచి, నన్ను లేపి స్నానం చేసి సిద్ధంగా వుండమన్నారు. మరో అరగంటలో వారు మాయింటిముందు నిలబడ్డారు. శెట్టిగారి దుస్తులు వింతగా వున్నాయి. ఖద్దరు లాల్చీ వేసేరు. గ్లాస్కో పంచె కట్టుకున్నారు. భుజంమీద ఎర్రంచుల జరీఖండువా వేసికొన్నారు.

ఇద్దరమూ కలసి ఆ ఊరు తాలూకాఫీసు దరిచేరేము. మరోసారి హోటల్లో కాఫీ త్రాగి, అప్పటికి లెక్కింపు ప్రారంభించి అరగంట అయింది. రోడ్డంతా క్రమంగా మనుష్యులతో నిండిపోయింది. శెట్టిగారు అటు, ఇటు నాలుగైదుసార్లు తిరిగి "పదండి భోంచేసివద్దాం" అన్నారు.

భోజనాలయాక మరోసారి వెళ్లేం. ఒక అభ్యర్థి పైకి వచ్చేడు. జనం ఆతని చుట్టూ గుమిగూడేరు. లెక్క పెట్టినంతవరకూ తనకే రెండువేలు మెజారిటీ వుందన్నాడు. శెట్టిగారు జోక్యం కలుగజేసుకొని—

"నేను ముందే చెప్పేను కాదూ" అన్నారు.

ఆ అభ్యర్థి శెట్టిగారికి నమస్కారం పెట్టేడు.

"పదండి ఓ గంట పడుకుని వద్దాం" అన్నారు.

శెట్టిగారి ప్రవృత్తి నాకు చాలా ఆశ్చర్యం కల్గించింది.

పడుకొని లేచి ముఖం కడుక్కొని కాఫీత్రాగి మూడుగంటలకు మరోసారి తాలూకాఫీసుకు వెళ్లేం.

మరో అభ్యర్థి పైకి వచ్చి "ప్రస్తుతానికి తనకి మూడువేల పైచిలుకు మెజారిటీ ఉం'దన్నాడు.

ప్రక్కనే వున్న శెట్టిగారు చేటంత మొఖంచేసుకొని—

"అంచనాలు తారుమారవలేదన్నమాట" అన్నారు.

శెట్టిగారి అభినయం చాలా చక్కగా వుంది.

శెట్టిగారూ, నేను దగ్గరలోవున్న పార్కుకు వచ్చి కూర్చున్నాం. మరోపావుగంటకు ఫలితాలు తెలుస్తాయనగా శెట్టిగారు చేమంతిపువ్వులదండ కొన్నారు. తాను కొట్టునుంచి తెచ్చిన కర్పూరహారంకూడా తీసి మరో చేత్తో పట్టుకున్నారు.

ఎన్నికలఫలితాలు ప్రకటించేరు. ఎవరో స్వతంత్రఅభ్యర్థి గెలిచాడట. రోడ్డుప్రక్కనున్న కారులన్నీ ఒక్కసారి స్టార్టుచేసి రోడ్డుమీద వరసగా నిలబెట్టేరు. బేండు మేళంజోరుగా వాయిస్తున్నారు. పోలీసులు జనసమ్మర్దంలో పేకబెత్తాలు అటూ, ఇటూ త్రిప్పుతున్నారు. శెట్టిగారు నన్ను వెనక్కి వచ్చి భుజంపట్టుకోమన్నారు. మెల్లిగా జనాన్ని తన భారీశరీరంతో తోసుకుంటూ తాలూకాఫీసు గేటు వేపు తోవతీసేరు. పాపం ఇద్దరి అభ్యర్థుల ధరావత్తులు గల్లంతు అయేయట. అక్కడ చుట్టూచేరిన జనానికి గెలిచిన అభ్యర్థిని చూడాలనున్నా, నాకు ఓడిపోయిన అభ్యర్థుల్ని, ముఖ్యంగా ధరావత్తులు కోల్పోయిన అభ్యర్థుల్ని చూడాలనుంది.

తాలూకాఫీసులోనుండి ఒకరొకరుగా పైకి వస్తున్నారు. శెట్టిగారు ఒక చేత్తో పూలదండలు, రెండో చేత్తో వింటోసీసా పట్టుకున్నారు. గెలిచిన స్వతంత్ర అభ్యర్థి విజయగర్వంతో పైకి వచ్చేడు. శెట్టిగారు దండలు రెండూ అతనిమెళ్ళో వేసి వింటోబాటిల్ కొట్టిఇచ్చేరు. పట్టాభిషేకం చేయించిన హరిదాసులాగ క్రమంగా గెలిచిన అభ్యర్థి మెడనిండా పువ్వులదండలు పడ్డాయి. శెట్టిగారు గెలిచిన అభ్యర్థిభుజంమీద చెయ్యివేసి కారువరకూ వెంటవెళ్లి అతన్ని కూర్చోపెట్టి, కారు తలుపువేసి కారు కదిలినదాకా వుండి పెళ్లికొడుకును సాగనంపినంత హంగామా చేసేరు. ఆ అభ్యర్థి శెట్టిగారివద్ద శెలవుతీసుకున్నాకే కారు కదలింది! నేనూ శెట్టిగారూ తిరుగుముఖం పట్టేం.

శెట్టిగారన్నారు "సాయంత్రం ఓడిపోయినఅభ్యర్థులు ముగ్గురి ఇళ్లకు వెళ్లి ఒకసారి సానుభూతి చూపించి వద్దాం. అక్కడితో ఎన్నికలగొడవ ప్రశాంతంగా ముగుస్తుం"దన్నారు.

కొన్నిరోజులు పోయేక మాఊరు వచ్చేశాను. నా స్నేహితులిద్దరూ ధరావతులు కోల్పోయారు. ఒకతని ఇల్లు, మరొకతని భూమి త్వరలో వేలం వేస్తారని అనుకుంటున్నారు. నిజం తెలుసుకుందామనుకుంటే వారిద్దరు నాతో మాట్లాడ్డం మానేశారే ఖర్మ! 

# పేరులోననేమి...



**జ్యేష్ఠ**

నిషి కుంఠేగర్వంలో సగం అందమైన పేరులోని మాధుర్యం వస్తుంది." తమ్ముడు సీరియస్‌గా డు, టేబిల్ ప్రక్క ఉపన్యాసకుడిలా రొమ్ము విరుచుకు నిలబడి. పదిమంది సలూ అలా నోళ్లు తెరుచుకుని వాడి క్కులోని కర్కశత్వాన్ని ఆస్వాదించేస్తున్నారు.

"మనిషి అదృష్టం ఎటువంటిదో పేరును వినగానే మనిషిని చూడకుండానే తెలియాలి." తిరిగి అదే ధోరణిలో మొదటి వాక్యం పూర్తయిన నిమిషానికి మొదలు పెట్టాడు. ఏదో ప్రజాసమస్య – సినీతార వివాహం లాంటిది – తీసుకు మాట్లాడుతున్నాడని తీర్మానించుకున్నాను. వీడు రాజకీయ నాయకుడయ్యే దురదృష్టం తప్పదనిపించింది.

"ఉదాహరణకు నా గొడవే తీసుకోండి"

"శేలు, శేలు!" అన్నారు సభలోంచి. అందరూ మూగారు. తాత్కాలికంగా ఉపన్యాసం ఆగిపోయింది.

అదీ! అసలువిషయం మొదలైందన్నమాట! – అనుకున్నాను. ఈమధ్య ప్రతి వాళ్లకీ – పెద్దవాళ్లకీ – చిన్నవాళ్లకీ ఓ అలవాటు పట్టుకుంది. అదే వాళ్ల వ్యక్తిగత సమస్యలను ప్రజాసమస్యలుగా చెయ్యడం. 'అతని'కి విజయవాడలోనే ఎక్కువ అప్పులవాళ్లుండడంవల్లనో అతని కూతురు మామగారు ఆ ఊరిలో పలుకుబడిగల పెద్దమనిషి కావడం వల్లనో ఆ ఊరంటే యావజ్జీవ ద్వేషం జనిస్తుంది. అతను అందుకని తనజిల్లాకి జిల్లా పుకార్ల ఉత్పత్తిదార్ల సంఘం సెక్రటరీ హోదాలోనో ధూమపాన సమాజం కార్యనిర్వాహకుడిగానో ఓ ప్రకటన చేస్తాడు. '...తీర్మానించడమైనది......కావున విజయవాడ రాజధానికి ఎంతమాత్రమూ తగదు.' అది ఏదో పత్రిక చిట్టచివరి పేజీ అట్టడుగులైనుకి అరంగుళం పైనపడుతుంది.

"నళినీదేవి? చూడండి ఎంతబాగుందో!" తమ్ముడు వృశ్చిక సంహార సంరంభంలో సంప్రాప్తించిన దడా, ఒణుకూ సర్దుకున్నాక, ఆ సాహసకృత్యంలో ఉద్భవించిన చెమట తుడుచుకుంటూ అన్నాడు.

శ్రోతల్లో ఇద్దరు "ఎంత బాగుంటుందో. ఎం...త బాగుంటుందో" అని ఏకకంఠంతో గట్టిగా అరిచారు. తమ్ముడు నోరు పొడవు రెట్టింపు తెరిచాడు. ఇంతకీ ఇద్దరూ మెచ్చుకోనేది సమావేశానంతరం ఇవ్వబోయే స్వీట్ రుచిని!

"ఆ పేరెంత తియ్యగా ఉంది! లేదూ!" తమ్ముడు అర్థిస్తున్నట్లు అందరి కళ్లలోకీ చూస్తూ ముందుకు ఒంగి మరీ అన్నాడు. ఇందాకటి యిద్దరు కుర్రాళ్లూ "తియ్యగానే వుంటుంది. మాకు లేదూ! మాకు లేదూ!!" అన్నారు యేడుపు గొంతుకలను మేళవించి. "ఉంది వుంది" నేను వాళ్లదగ్గరకు వెళ్లి నెమ్మదిగా అన్నాను. వాళ్లు భయంతో ఆరిపోయిన పెదిమల్ని తడుపుకుంటూ, స్వీట్‌ను స్మరించుకుని "ఉంది, ఉంది...ఉంది, వుంది" అన్నారు ఉత్సాహంగా. వాళ్లు చివరివరకు ఉత్సాహంగానే వున్నారు.

"పేరు వినగానే మనిషి స్వరూపం మనసులో మసలాలి" తమ్ముడు నెమ్మదిగా అన్నాడు. "అందమైన పేరు వినపడితే ఒళ్లు పులకరించిపోతుంది" ప్రతివాక్యానికి తరువాత అవసరమైన వ్యవధి నిస్తూ అంటున్నాడు. మా క్లాసులో మురళీధర్ అని వొకడుండేవాడు. రిజల్ట్సు చూస్తుంటే వాడి మొహం చూసి "అన్ని పార్టుల్లోనూ పోయింది కాబోలు పాపం" అనుకున్నాను. వాడు ఫస్టుక్లాసులో పేసయ్యాడట. తమ్ముడిమాట నమ్మితే వాడి పేరు ఏవిచారధర్ అనో విషాదమూర్తి అనో విలాపకాంత్ అనో ఉండాలి.

'రామమోహనరావు! చూడండి. ఈ పేరెంత మధురంగావుందో! ఈ పేరు వింటూవుంటే మీకెవరు కనిపిస్తున్నారు? తెల్లని సన్నని, పొడుగైన, అందమైనవ్యక్తి మృదువైన చిరునవ్వుతో మధురమైన కంఠస్వరంతో..." తమ్ముడు సభికుల అభిప్రాయంకోసం చూస్తున్నాడు. వాళ్ళల్లోంచి ఓ ఎనిమిదేళ్ళ చొక్కాలేని పంకభూషిత చిద్విలాసస్వరూపుడు, అశ్రుభాసిత వదనుడు కాలకాయను ముక్కుపుటాల నెగరేస్తూ, జారిపోయే లాగు లాక్కుంటూ బయటకు పరుగెత్తేడు "మా అన్నయ్య పేరు రామమోహనరావే" అంటూ.

సినీమాల్లో హంతకుడి దర్శనం ముందు ఆర్కెస్ట్రా నోరుమూసుకుంటే వచ్చే నైశ్శబ్ద్యం ఆగదిని ఆవరించింది. అందరూ ఊపిరి బిగపట్టి రెప్పవాల్చకుండా ద్వారం వేపు చూస్తున్నారు.

హఠాత్తుగా "నేను ఏహోటల్లోనూ పని చెయ్యలేదండి ఐనా మైసూర్ పాక్ బాగా చేస్తానండి. మీకెలా తెలిసిందండి నాసంగతి" అంటూ ఓ రోలరులాంటి నల్లనివ్యక్తి నల్లటి పళ్ళతో ఉషారుగా నవ్వుతూ గదిలోకి దొర్లాడు. అతని ప్రతీపదం సగం గార్దభం మాట్లాడినట్లుంటే, సగం కీచురాయి ధ్వనిలాగా వుంది. అతని వెనకాల విజయ గర్వంతో 'నూకారా మజా' అన్నట్లు చూస్తున్న కుర్రాడు, తమ్ముడూ, తదితరులూ తెల్లబోయారు. వ్యక్తి ముసిముసి నవ్వులు నవ్వుతూ గజగమనంతో కదుల్తుంటే కింద చెల్లి దడుసుకుంది కాబోలు కుక్క పెట్టింది. నాన్నగారు "ఉరుములేమిటి మబ్బులేకుండా!" అన్నారు. అది చి॥ రామమోహనరావు తప్పటడుగులు వేస్తే వచ్చిన ధ్వనులన్నమాట!

ఈ వేళ తమ్ముడి పుట్టిన రోజు. అందుకని టీ పార్టీ చేశాడు. పెద్దలని—పెద్దలేమిటి వాడి క్లాస్ మేట్సేరారు—పిలిస్తే రారని, కుర్ర వాళ్ళని పక్కవాళ్ళని పిలిచాడు. టీ పార్టీకి ముందు ఈ ఉపన్యాసం. సదరు రామమోహనరావు తమ్ముడు చి॥ మర్కట కిశోరరావు తమ్ముడి సందిగ్ధోచ్చారణలోంచి ఏవో తిండి కలలు పోగు చేశాడు. వాడికి ఆదినుంచీ అదే ఆలోచన కావడం మూలాన (క్రీడించి మేళవించే మానవ నైజం ప్రకారం) స్వీట్ చేసేందుకు ఎవరూ లేరేమోనని బలమైన అనుమానం సహజంగానే కలిగింది. వాడి అన్నయ్య మైసూరుపాకం చెయ్యడం కనులారా చూసి ఉన్నాడాయె! అందుచేత క్షణం ఆలస్యం చెయ్యకుండా అగ్రజుణ్ణి పిల్చుకొచ్చాడు.

రామమోహనరావు గదిలో ప్రళయ తాండవం చేసేస్తున్నాడు. "నన్నెందుకు పిలిచినారు...నన్నెందుకు...నన్నెం...దుకూ పిలిచీనారూ" అని కీర్తన పాడినట్టు రెట్టించి రెట్టించి మరీ అడుగుతున్నాడు కావు కావు మన్నట్టు.

# ★ పేరులోననేమి... ★

తమ్ముడికి భయం వేసింది, రామమోహనరావు చావకొడతాడేమోనని. నేను కలకజేసుకోక తప్పింది కాదు. రామమోహనరావు దగ్గరకు వెళ్ళి నవ్వుతూ "మీ దర్శన దౌర్భాగ్యం కలగటం మా దురదృష్టం" అన్నాను ఇంగ్లీషులో. రామమోహనరావు స్నేహ భావంతో నవ్వుతూ "అవునండి అవునండి. నా ఉద్దేశమూ అదేనండి" అన్నాడు. "మీరు కాదనకూడదు. మీరు టీ పార్టీకి ఉండిపోవాలి" అన్నాను. "సరేనండి" అని కుర్చీలో కూలబడ్డాడు. కుర్చీ 'కుయ్' మంది. కాని అది చాలా గట్టి దవటంవల్ల డాక్టరుని తీసుకొచ్చే అవసరం రాలేదు.

"అనంత వసంత శ్యమంత సుమంత ప్రశాంత లతాంత నిశాంత కాంత! ఈ పేరు మాడండి" అన్నాడు తమ్ముడు. వాడా పేరు అసహ్యకరమైన పేర్లలో చేర్చమంటున్నాడో అందమైన పేరుగా తీసుకోమంటున్నాడో శ్రోతలకి అర్థంకాలేదు. ఏదో అవాలికదా అని, "అవును, అవును" అన్నారు. నాకు నవ్వాగలేదు. తమ్ముడు వాళ్లు తనభావాన్ని అర్థం చేసుకోనందుకు ఎంతో విచారిస్తున్నట్టు కనపడ్డాడు. చివరకు నిషాదాన్ని దిగమింగి "ఈ పేరులో సంగీతం ఉందికదూ!" అన్నాడు. "ఉంది! ఉంది!" అన్నారు సభ్యులు. "ఉంది!" "ఉంది" "అలాఉండాలి ప్రజాసహకారం" అన్నాడు తమ్ముడు.

"మీకందరికీ తెలుసు, పేరులో ఎంత మహిమ ఉందో, లోకులకీ తెలుసు—ఆ బారసాలపీటలమీద కూర్చున్న దురదృష్టవంతుడి తల్లితండ్రులకి తప్ప. పిల్లవాడి దురదష్టం ఉపశమించేందుకో అన్నట్లు వాళ్లు అందరు దేవుళ్ల పేర్లూ స్మరిస్తారు. చిన్నప్పుడు వాళ్లకి ఈ పేర్లు తగిలించిన తమ తల్లితండ్రుల్ని స్మరిస్తారు. ఎదురుగా ఏడుపు మొహాలతో కూర్చున్న పెద్దల్ని చూస్తారు. వీళ్లందరి పేర్లూ గూడ్సుపెట్టెల్లా ఓదాని వెనకఒకటి తగిలిస్తారు వీళ్లపిల్లలకి. "లాగండ్రా బాబు! లాగండ్రా నయ్‌న!" అంటారు. వాళ్లు యావజ్జీవం ఆ పేరును పళ్లు బిగపట్టి చెమటోడుస్తూ లాగవలసిందే. లాగనివాడు అనాయకుడు అవుతాడు. ఈ పేరు మీరు విన్నారా! 'వీరవెంకట ఆనంద అగ్ర మహోదగ్రచిన పెదకామరాజుమూర్తి' అనగా V. V. A. V. A. M. P. K. R. మూర్తి. ఇంగ్లీషు భాషలో దాదాపు అన్ని అక్షరాలూ వాడిపేరులోకి రావాలని చూస్తారు. 'వెధవాయికి ఈవిధంగా నేనా ఏబిసీడీలు జ్ఞాపకం ఉంటాయను' కుంటారు కాబోలు!" నాకు నవ్వొచ్చింది. అటువంటి పేరే ఒకటి తమ్ముడికి ఉంది. అది మరీ పొడుగ్గా ఉండడంవల్ల నాకు జ్ఞాపకంలేదు పూర్తిగా. వీడు మొదటిసారి అప్లికేషన్ ఫారం చూసి చాలా నిరుత్సాహ పడ్డాడు. "నేమ్ ఇన్‌ఫుల్" అని చూసి బేజారెత్తిపోయాడు. ఆ 'కాలం' వీడిపేరులో పూర్వభాగంలో నాలుగోవంతుకి సరిపోదు. 'ఏం చెయ్యాలి' అని తీవ్రంగా ఆలోచించాడు. మహాకవుల సలహాలు తీసుకున్నాడు. చివరకు ఓపావుటావు కాగితాన్ని సమద్విఖండనచేసి దానిమీద ముచ్చటగా ఎనిమిది పంక్తుల్లో ఇరికించి ఇరికించి రెండు వేపులా (P. T. O. అని రాసి) రాశాడు. ఆ కాగితాన్ని పెద్దలసమక్షంలో అప్లికేషన్ ఫారా అంటించి రెండూ కలిపి ఒణుకుతూ పోస్టుచేశాడు.

"మనవాళ్లు ఈ పేర్లు ఎలా పెడతారో నా కర్థంకాదు" తమ్ముడు తనబాధని వెల్లడించాడు. ఓనిమిషం ఆగి "నేను పేరుమార్చుకోవాలనుకుంటున్నాను" అన్నాడు తుపాకి పేల్చినట్టు. మేం కలిసికట్టుగా ఆశ్చర్యపోయాం. "ఏ పేరుపెట్టుకో నేదీ రేపు వెల్లడిస్తాను. టీపార్టీకి తయారుకండు" అన్నాడు.

* * *

"భాషలో తనపేరుకంటే ఇష్టమైనదిఉండదు ఎవరికీని" ఏడుపుగొంతుకతో అన్నాడు తమ్ముడు.

"అలాగే నీ ప్రస్తుతపుపేరంటే అభిమానాన్ని అలవర్చుకోవాలి" అన్నాను.

"ఎలాగేమిటే!" అన్నాడు వాడు.

"ఎలాగేమిటి! నాపేరు గోదావరి బ్రిడ్జంత పొడవైనది అబ్బో ఎంతపొడుగైందో! అనుకోవాలి."

"ఏడిశావ్ లే" అన్నాడు వాడు.

"ఎవరెస్టులాంటి ఎత్తులూ, పసిఫిక్ లాంటి పల్లాలూ కొల్లలు".

"చాల్లెద్దూ! నీకే నాలాంటి పేరుంటే అది కంఠతాపట్టేటప్పటికి తాతలు దిగొచ్చేవారు. నాకు కనుక సులువుగా ఒచ్చేసింది."

"అవును అదీ నిజమే. అందులో కొన్ని పదాలు నాకు నోరు తిరగవు కూడాను" అన్నాను.

తమ్ముడి ఉక్రోషం అవధులు దాటింది. "నా పేరును బుల్‌డోజరుకూడా సాఫీ చెయ్యలేదు. అందుకే దీనికి పింఛనిచ్చేసి కొత్తపేరు సంపాదిస్తాను." అన్నాడు.

"అసలీ పేరు ప్రపోజ్ చేసిందెవరు?" తమ్ముడు అమ్మమ్మని నిలతీసి అడిగాడు.

"అంతపెద్దపేరుండడం నాకుమాత్రం ఇష్టంరా నాయనా? నేను ఒక్కపేరే, మీ తాతయ్యది చెప్పాను." తమ్ముడు శాంతించాడు. పెద్దవాళ్ళని ఎవర్నడిగినా '
సూచించాను' అన్నారు ప్ర
అలా ఆ దుర్ముహూర్తాన ఏభైన
చిన ఏభై పేర్లూ కలిపి వీడినామ
రూపంలో కూర్చారు. మంచి
ఒచ్చింది. 'హనుమంత వీరాం
మృత్యుంజయాకార రాజేశ్వర రా
త్మజ..." అలా కవితా ప్రవాహంల
పోయింది వాడిపేరు.

తమ్ముడికి ఎవరిమీద విరుచుకుప
తేలలేదు. విధి చెల్లిని ఆవేశించినట్లు భా
దాన్ని భారతీయభాషల్లో పసందైన తిట్ల
పోగుచేసి తయారుచేసిన సంకర స.
సంతో తిట్టి చావకొట్టాడు
చెల్లి కెనడియన్ ఇంజన్ లా
మృదువుగా ఏడవటం మొదలు పెట్టింది. దానికి లంచాలేవో ఆశపెట్టి నమ్మకంకోసం ఎడ్వాన్సుగా జేబులోని పిప్పరమెంట్లన్నీ దాని చేతులోపోసి ఏడుస్తూ చేతులు కడుక్కున్నాడు తమ్ముడు.

"ఒరే రాజా పేరు బాగుండకపోతే నేంరా నువ్వు బావున్నావుగా" అన్నాను.

"అదే ఒచ్చిన బాధ. నా పేరు వినగానే ఏం స్ఫురిస్తుంది?" అన్నాడు వాడు.

"ఆ పేరు సొంతదారుడి ఓపిక, జ్ఞాపకశక్తి" అన్నాను. అది వాడికి నచ్చలేదు.

"నా పేరు మార్చేస్తాను. అది నా రూపానికి తగ్గట్టుండాలి" అన్నాడు.

"అభినవ హనుమంత బాగుంటుంది" అన్నాను.

వాడికి నామీద ఉండే సదభిప్రాయం పోయింది. "నువ్వూ కుట్రదారుల్లో వాడవే. నా పేరు నేను చూసుకుంటాలే" అన్నాడు. వాడు డ్రాయర్లోంచి ఓ పొడుగు బుక్కు తీశాడు. నా కాశ్చర్యం వేసింది. అందులో ముప్పైమూడుకోట్ల దేవతలపేర్లు, తారల పేర్లూ, దేశవాళీ నాయకుల పేర్లూ, ప్రపంచ శ్రిలపేర్లూ, పురాణ స్త్రీలపేర్లూ ముద్దుగొలిపే ఒంకర అక్షరాల్లో, ముద్ద సిరాలో, కొట్టివేతల్లో, తప్పుల్లో అకారాదిక్రమంలో ఏడుస్తూ కనపడ్డాయి. వాడు తనకు నచ్చిన పేరు వాటిలోంచి ఎన్నుకోవాలి. "భానుమతి పేరు బాగుంటుందికదూ" అన్నాను. "చాలా బాగుంటుంది" అన్నాడు ఉత్సాహంగా; కాని మరుక్షణంలో చప్పబడిపోయాడు. "అది ఆడపేరు" అన్నాడు: "పోనీ పద్మిని" అన్నాను. వాడు కొట్టినంత పని చేశాడు. "అదీ ఆడపేరే"

"అది నీకోసం కాదు. అసలు బాగుందా లేదా?"

"బాగానే ఉంది"

"అయితే పై రెండిటిలో ఏదో ఒకటి ధరించు" అన్నాను.

# నాగపూర్ కమలా

“రవి”

“మంచిది. ఆఁ ఆఁ. వ్యవహారం అంతదాకా వచ్చిందన్నమాట” అన్నాడు ప్రొఫెసర్ కిరణశంకర్ అస్వస్థుడై.

ఎదురుగానున్న బుట్టలో పం[డెండు కమలాపండ్లు చక్కగా పేర్చి వున్నాయి. చక్కని నీలిరుమాలు ఆ బుట్టమీద కప్పివున్నది. ఆ రుమాలుమీద “సరససాంగత్యసుఖవికాసమునకన్న, దుస్సహ వియోగభరమె మధురము” అని రంగురంగుల ఊలు దారాలతో కుట్టబడివున్నది. ఎవడో వెధవాయ్! ప్రణయగీతాలు వెలిగిస్తున్నాడు. వీడిసిగ్గు చితక ... అసలు [illegible]సలైన నాగపూర్ కమలా...తాజా పండ్లు – అరముగ్గిన పసందైన పండ్లు. పెద్దపెద్దవి. మధురాతి మధురమైనవి. ప్రతిపండు తొడిమవద్దా రెండేసి ఆకులుగూడా వున్నవి. దూరంలో వున్న హృదయాధిదేవత నారాధించడానికై యీ పండ్లను కానుకగా పంపుతారు. ఆహా! ఎంత చక్కనిపండు.

ప్రొఫెసర్ కిరణశంకర్ భార్య కాళిందికి కమలాపండ్లంటే మహాయిష్టమని బహుశా వాడికి తెలిసివుంటుంది. అందుకే ఈ పండ్లబుట్ట యిక్కడకు చేరింది.

“ఎవరుపంపారు? ఎందుకు పంపారు? కాళిందికీ అతనికీ సంబంధమేమిటి?” అనే ప్రశ్నలు ప్రొఫెసర్ గారి మెదడులోదూరి గ్రుద్దులాడసాగాయి. అతనికి చిరాకుఎక్కువైనది.

నౌకరునుపిలిచి “ఈపండ్లబుట్ట యిక్కడికెలా వచ్చింది?” అని ప్రశ్నించాడు.

“నాకు తెలియదు హుజూర్. ఎవరో ఒక యువకుడువచ్చి అమ్మగారికి సలాము పెట్టి ఈబుట్ట యిచ్చాడు.”

“ఇంకేమైనా యిచ్చాడా?”

“నీలిరంగు కవరొకటి యిచ్చాడు.”

“ఎక్కడున్న దది?”

“అమ్మగారు తమపెట్టెలో పెట్టి తాళము వేసుకొని బజారుకు వెళ్ళారు.”

“బజారుకు వెళ్ళిందా?” అవునుమరి తప్పకుండా వెడుతుంది. మరల అతనికేదో బహుమానం తీసుకొనిరావడానికై వెళ్ళివుంటుందనుకున్నాడు ప్రొఫెసర్ మనసులో. ప్రొఫెసర్ హృదయం ఆరాటపడజొచ్చింది. అతనికి కోపంగూడా వచ్చింది.

ఈ రోజులలో చదువుకొన్న పిల్లలను పెండ్లిచేసుకుంటే యిదే అవస్థ. కామ సంబంధమైన కథలు చదువుతారు. పిచ్చిపిచ్చి సినిమాలన్నీ చూచి సినిమాతారల్లా తయారుకావాలనుకుంటారు. ప్రేమ వికృతిని ప్రదర్శించే చవకబజారు సినిమాలంటేనే వీరికి యెక్కువ అభిమానం. అనేకమంది వ్యక్తులతో స్నేహంచేస్తారు. ఎవరినో ఒకరిని ప్రేమిస్తారు. పరిస్థితు లనుకూలంగాలేక యింకొకరిని వివాహమాడతారు. ఇందుచే వియోగదుఃఖంతో జీవితాంతం యిరువురూ కుమిలి కుమిలి యేడుస్తుంటారు.

వీళ్ళకు సిగ్గూ శరమూ లేదనుకుంటాను. పెండ్లి అయిన తరువాతనైనా కట్నాలు కానుకలు పంపగూడదనే జ్ఞానం వీళ్ళకు లేదనుకుంటాను. ఈ వెధవెవడో పెండ్లికాక ముందు కాళిందిని ప్రేమించి వుండవచ్చు. పెండ్లి అయినతరువాత యిలా పండ్లబుట్టలు పంపవచ్చా? ఛా! ఛా.

అయితే కాళింది నన్నెందుకు వివాహమాడింది? నేనామె నేమీ బలవంతపెట్టలేదే? ఆమెతండ్రి నావద్దకు వచ్చాడు. “నాకొక్క కుమార్తె వున్నది. నేను బారిష్టరునై సంపాదించిన ఆస్తిఅంతా ఆమెదే. ఈ సంవత్సరమే బి. ఏ. గూడా ప్యాసయింది. సంగీతము, కుట్టుప[illegible] మొదలైనవి గూడా వచ్చు. ‘మీ రిరువురూ చిలకాగోరువంకల్లా కలిసిమెలసి మాయింట్లో తిరుగుతుంటే చూడాలనివున్నది’ అన్నాడు. నేను సరేనన్నాను. అందుచేత నాకీ ప్రాయశ్చిత్తం జరిగింది.

ఈబుట్ట యివ్వాళ నాకండ్ల బడింది. నాకు తెలియకుండా [illegible]త్తరాలు యెన్నాళ్ళనుండి నడుస్తున్నవో? బహుశా రహస్యంగా యిరువురూ అప్పుడప్పుడూ కలుసుకొంటూ వుంటారుగూడా. అటు నేను కాలేజీకి వెళ్ళి రిసర్చి లేబరేటరీలో మునిగిపోగానే యిక్కడ కాళింది — ఛీ. ఛీ. ఎంతటి కృతఘ్నురాలు. నేనామెను యెంతగానో నమ్మానే! ఆమె చేయవలసిన పనియిదేనా? ఓరి భగవంతుడా! ఈవిషపాత్ర నాకెందుకిచ్చావయ్యా! నాకంటే దౌర్భాగ్యుడింకెవరూ నీకు కనిపించలా?

అంతకంతకూ ప్రొఫెసరుగారికి కోపం యెక్కువ కాజొచ్చింది. కుర్చీమీదనుండి లేచాడు. గదిలో అటూ యిటూ పచార్లు చేయసాగాడు. సిగరెట్ ముట్టించాడు. దాని నవతల పారేశాడు. మరొకటి ముట్టిం

(55-వ పేజీ చూడండి)

---

“ఎవరూ రోడ్డుమీద ఉమ్మెయ్యక్కర్లేదు” అన్నాడు వాడు.

“ఎలకూచి బాల సరస్వతిలేదూ...దయానంద సరస్వతిలేదూ” అన్నాను.

“నాకు ఆడపేర్లొద్దు. వాళ్లు గొప్పవాళ్లు ఏ పేరున్నా చెల్లుతుంది. అలెగ్జాండరు తన పేరు అక్కుపక్షి అని మార్చుకున్నా అతని విగ్రహాలు చెక్కడం మానరు” అన్నాడు వాడు.

ఐదు నిమిషాలు గడిచాయి.

“నా పేరు విన్నవాళ్లు నేనెలా వుంటానో చెప్పెయ్యాలి. అలావుండాలి నా పేరు” ఒక పేరు చెప్పి.

“ఇదిచూడు. ఇది చూడగానే నిత్యం నాట్యంచేసే వ్యక్తి పరిత్తు. పోయినా మెలికలు తిరుగుతూ చేతులుతిప్పే అబ్బాయి జ్ఞాపకం వొస్తాడుకదూ. అది నీకు సరిపోతుంది” అన్నాను.

“ఏడికావ్‌ళే” అన్నాడు. వాడు ఉత్సాహమంతా తిరగేసి ఓ పది మధురాతిమధురమైన పేర్లు పోగుచేశాడు. “రామమోహన్, నాగరాజారావు, శ్రీనివాసరావు, నళిని, రజని, శశికాంత్, కమలాకర్...” వాటినన్నిటినీ కలిపి కష్టపడి ఓ పేరు తయారుచేశాడు.

“వెధవా! ఈ పేరుమాత్రం ఘర్లాంగు పొడుగులేదూ! నీ కిష్టమైతే సరి! అందుకే తా వలచింది రంభ, తా మునిగింది గంగ అన్నారు” అన్నాను.

‘అయితే నేనుపంపే ప్రతికథకీ నాపేరు కోసం ఓ అర్ధకాలంకేటాయించవలసిందేనా!’ అన్నాడు హీనస్వరంతో.

ఇదిజరిగి పదేళ్లయింది. వాడిప్పుడు తన పేరు పూర్తిగా సగర్వంగా చెప్పుకుంటాడు. వాడికథల్లో పేర్లుకూడా మధురంగా వుండాలని చూడుడు. వాడిపెన్నేమే అటువంటిది. “ముష్టిశ్రీ!” ఆపేరు మీరూచూసేవుంటారు. అందుకే అనుభవం చక్కనిగురువు అంటారు.

★

టాడు. ఒక్కదమ్ము లాగాడు. దానిని గూడా అవల పారవేశాడు. ఈప్రకారంగా టిన్నులోనుండి సిగరెట్టు తీయనూ ముట్టించనూ, అవల పారవేయనూ, టిన్ను ఖాళీ చేశాడు. కోపంతో శరీరమంతా కంపిస్తున్నది. ఇప్పుడేమిచేయాలి? ఏమి చేయగూడదు? అనే ప్రశ్నలు ఆయనను బాధింపసాగాయి. అదృష్టవశాత్తు కాళిందీదేవి ఆ సమయంలో అక్కడలేదు. ఉంటే యేదో ఘోరం జరిగేదే. కోపం విచక్షణజ్ఞానాన్ని నశింపజేస్తుంది.

ప్రొఫెసర్ కిరణశంకర్ క్రిష్టియన్ కాలేజీలో ప్రొఫెసర్. మూడువందల యాభై రూపాయలు జీతం వస్తుంది. వయస్సు షాతిక, ముప్పై సంవత్సరాలకంటే ఎక్కువుండదు. అందమయిన వాడనే చెప్పవచ్చు. ఎం. ఎస్. సి. ప్యాసవగానే యీ కాలేజీలో ప్రొఫెసర్ ఉద్యోగం దొరికింది. ఇతని తెలివితేటలకు కాలేజీ ప్రిన్సిపాలు గూడా ముగ్ధుడయ్యేవాడు. అందుచే యితనంటే ప్రిన్సిపాలుగారి కెంతో ప్రేమ. కిరణశంకర్ మంచి వక్త. డిబేట్లలో గూడా పాల్గొంటుండేవాడు. కాలేజీ విద్యార్థులాడే నాటకాలలో డైరెక్టరుగా పనిచేసేవాడు. వేషాలు వేసేవాడు. విద్యార్థులకు, ఇతర ప్రజలకు ఆయనంటే యెంతో గౌరవం. అభిమానంగూడా. చిన్నవయస్సులోనే అందరి ఆదరాభిమానాలను సంపాదించుకొన్నాడు.

ఒకప్పుడు అకస్మాత్తుగా ఒక బంగాలీ యువతిని ప్రేమించాడు. ఆ అమ్మాయి బి. యస్. సి. సీనియర్ చదువుతున్నది. అందమైనపిల్ల. శరీరసౌష్ఠవంగూడా చక్కగా వుండేది. నాటకాలలో వేషాలు వేసేది. వీరిరువురి ప్రణయగాథ లోకానికి వెల్లడైంది. కాలేజీ అధికారులవరకూ పోయింది. ఈ అపవాదు బాపుకోవాలని ప్రొఫెసర్ చాల ప్రయత్నించాడు. కాని లోకాన్ని మూయడానికి మూకుడున్నదా? ఇలా కొంతకాలం జరిగితే, తన ఉద్యోగానికే విద్వాసం చెప్పవలసి వస్తుందనుకొన్నాడు.

కాని ఒక విచిత్రసంఘటన జరిగి ప్రొఫెసర్ గారు యీ ఆపదలోనుండి బయటపడ్డారు. ఆ పిల్ల తండ్రికి యీ విషయం తెలిసి ఆమెను తీసుకొని వెంటనే కలకత్తా వెళ్లి, ఆ అమ్మాయిని ఒక రైల్వే ఆఫీసరుకిచ్చి పెండ్లిచేశాడు.

ప్రొఫెసరుగారి కీవిషయం చాల బాధ కలిగించింది. కాని 'అభావే విరక్తి' అన్నట్లు సమాధానపడ్డాడు. "ఛీ! పోతే పోయింది. లేకుంటే ఆ స్కాండల్తో రోజూ పోట్లాడవలసి వచ్చేది. ఆ పిల్ల తండ్రిగూడా ఉన్నతాధికారే. అత నిలాంటి విషయాలను సహించలేడు. ఈ విషయం మా ప్రిన్సిపాలుగారికి తెలిసినా ఆయనా సహించడు. ప్రిన్సిపాలు అసలైన కాథలిక్. అందుచే యిలాంటి విషయా లాయన చెవినిపడరాదు. ఏమి జరిగిందో జరిగింది. ఆ అమ్మాయి అలా కలకత్తా వెళ్ళిపోవడం మంచిదైంది.

కాని ఆ అమ్మాయి రూపాన్ని తన హృదయ ఫలకంపైనుండి చెరిపివేయలేకపోయాడు. అతని జీవితంలో యిదే ప్రథమ ప్రణయం. అందుచే దాని మధురిమ అద్భుతము, అపూర్వము, అసమానము.

ఆమె జ్ఞప్తికి వచ్చినప్పుడల్లా ప్రొఫెసరు మనస్సు మనస్సులో వుండదు. చిన్న విషయంగూడా అతని మనస్సును కలతపెడుతుంది. ఈ బాధను కనపడకుండా చేయడానికై అతను అనేక ప్రయత్నాలు చేసేవాడు.

ఇలాంటి సమయంలో కాళింది తండ్రి వివాహ ప్రస్తావన తెచ్చాడు. కాళింది ఫొటో చూచాడు. తరువాత ఆమెనుగూడా చూచాడు. సరే నన్నాడు. చైత్ర శుద్ధ పంచమినాడు వివాహం జరిగి పోయింది.

కాళింది నిజంగా మంచి శీలవతి. ఆమె ముఖంలో యెప్పుడూ చిరునవ్వు వెన్నెలలు చిందులాడుతుంటాయి. సరళస్వభావ. ఆమె తన గృహాన్ని స్వర్గధామంగా, ఆనందమయంగా చేయడానికై ప్రయత్నించేది. భర్తమాట జవదాటేదికాదు. అతనిని సుఖపెట్టడానికి సర్వదా ప్రయత్నించేది. పెండ్లికాకపూర్వం తన భర్త మరొక అమ్మాయిని ప్రేమించాడన్న విషయం ఆమెకు తెలిసింది. దానితో ఆమెకు కొంచెం బాధ కలిగింది. కాని యీ విషయం భర్తదగ్గర యెప్పుడూ యెత్తేదికాదు.

ప్రొఫెసరుగూడా వెనకటి ప్రణయగాథను మరచి కాళిందిలో నూతన ప్రణయాన్ని పొందడానికి ప్రయత్నించేవాడు. కాళిందికి విశ్వాసం కలిగేలా ప్రవర్తించేవాడు. ఆమెమాటను జవదాటేవాడుకాడు. ఇలా కొంతకాలం సంతోషంగా గడిచిపోయింది. అప్పుడు ఆ బంగాలీ యువతి జ్ఞప్తికి వస్తే మాత్రం కాళిందిమీద విసుక్కునేవాడు. చిరాకును వెలిబుచ్చేవాడు. అలా రెండుమూడు రోజులు గడిచాక మరల మామూలు ధోరణిలో పడేవాడు.

కాళింది యిదంతా గ్రహించక పోలేదు. కాని ఆమె బయటకు పొక్కనిచ్చేదికాదు. ఆమెకు దుఃఖమొచ్చేది. ఏడ్చేది. కానయేమి చేయగలదు? తన దుఃఖాన్ని తనిలోనే అణచుకొనేది.

తన పూర్వ ప్రణయగాథ కాళిందికి తెలియదని ప్రొఫెసర్ గారి నమ్మకం. అలాంటి నమ్మకంతోనే అతను కాళిందితో కాపురం చేస్తున్నాడు.

ఆ నాడు తలనొప్పిగా వున్నదని కాలేజీకి సెలవుపెట్టి పెందలకడనే యింటికి వచ్చాడు. వచ్చిచూస్తే యేమున్నది? కాళింది యింటివద్దలేదు. ఈ కమలా పండ్లు యెదురుగా కనిపిస్తున్నాయి. ఈ అందమైన కమలా పండ్లను చూస్తుంటే కమ్మని, మధురమైన భావా లుత్పన్నమౌతున్నాయి. నాకు యిలాంటి పండ్లు పంపించే వారెవరున్నారు? నేనేమీ పోలీసు అధికారినన్నా కాదే, ఎవరైనా బహుమతులు పంపడానికి! ఇవి తప్పక కాళింది కొరకు పంపబడినవే. ఎవరో ఆమె పూర్వపరిచితుడు, బహుశా ప్రేమికుడై వుండొచ్చు, పంపించి వుంటాడు. లేకుంటే నీలికవరు అంతభద్రంగా తన పెట్టిలో పెట్టి తాళం యెందుకు వేస్తుంది? ఇంకా విచిత్రమేమంటే ఆ కవరు తెల్లదికాదు నీలవర్ణంది. ప్రియులు వ్రాసుకునే ఉత్తరాలు సాధారణంగా నీలపు కవర్లలోనే పెట్టి పంపిస్తారు. తెల్లరంగులో కీర్తిప్రతిష్ఠలేగాని ప్రణయముండదు.

కాళింది రావడం ఆలస్యమౌతున్న కొద్దీ అతని అనుమానం బలపడసాగింది. పిచ్చెక్కిన కోతిలా యింట్లో చిందులు వేయసాగాడు. అతని క్రోధాగ్ని ప్రజ్వలింపసాగింది.

కాళింది మెల్లగా గడపలో అడుగు పెట్టింది.

"ఈ పండ్ల బుట్ట యెక్కడనుండి వచ్చింది?" అని గద్దించాడు.

ఈ పిడుగుపాటుకు కాళింది ఉలిక్కిపడింది. తన భర్తలో యిలాంటి ఉగ్రస్వరూపాన్ని ఆమె యెప్పుడూ చూడలేదు. ఆమెకు భయం గూడా వేసింది.

ఆమె భయాన్ని చూచి ప్రొఫెసరుగారి అనుమానం మరింత బలపడింది. భార్య కులట, పాపి, అని నిర్ణయించుకొన్నాడు. లేకుంటే భయపడవలసిన అవసరమేమున్నది?

కాళింది మారు మాట్లాడలేదు.

"ఏయ్! నిన్నే, ఈ బుట్ట యెక్కడనుండి వచ్చింది?" అని మరల ప్రశ్నించాడు.

కాళింది యేమీ జవాబివ్వకుండా కొంగునవున్న తాళం చెవులు తీసుకొని గదిలోకి వెళ్లి పెట్టె తెరచి నీలికవరు తెచ్చి అతని చేతిలో పెట్టింది.

కవరుపైనున్న అడ్రసు చూడగానే

ప్రొఫెసరుగారి ముఖం పాలిపోయింది. ఆ కవరు తన పేరనే వచ్చింది!

కవరు చింపి చదువసాగాడు. ఒక్కొక్క పంక్తి చదువుతుంటే కృష్ణ పక్షు చంద్రునిలా అతని ముఖకవళికలు క్షీణింపసాగాయి. అతని ముఖంలో కత్తి వేటుకు నెత్తురు చుక్కలేదు. ఆ ఉత్తరము, ఆ బుట్ట పంపిన వ్యక్తి ఆ బంగాళీ యువతి!

ప్రొఫెసర్ కిరణ శంకర్ చేతిలో నుండి ఆ ఉత్తరం అప్రయత్నంగా క్రిందపడింది. కాళిందీదేవి కింకర్తవ్యతా విమూఢురాలై అతని ముఖంలోని పరివర్తనాన్ని గమనిస్తూ నిలబడి పోయింది. ★

(హిందీనుండి అనువాదం:

---




# జాతీయారోగ్య సేవాసమితి

ఇల్లిందల సరస్వతీదేవి

రెండో పెద్ద దిక్కు లేని సామాన్య సంసారాలలో అయిదారుగురు బిడ్డల తల్లి జబ్బుపడితే [illegible] యింటి పరిస్థితి ఎట్లా ఉంటుంది? ఒకస్సారి కంటితో చూస్తే మరపు రాని దృశ్యముగా ఉంటుంది!

పసిబిడ్డ ఎడబిడ్డల ఏడుపులతో చెవులు హోరెత్తిపోతాయి. పెద్దపిల్లలు పొయ్యి దగ్గర చేరి తంటాలు పడుతూ ఉంటారు. రోగి మూసినకన్ను తెరవనిస్థితిలో ఉంటే, గృహస్థు కచేరీకి సెలవు పెట్టి, ఇంట్లో నేఉండి ఉపచారాలు చేస్తాడు. మరి ఆదుర్దాగా ఉంటే, వైద్యుడిని యింటికి పిలిపించి చూపిస్తాడు. లేనిపక్షములో వైద్యునిదగ్గరికి తీసుకొనివెళ్లి చూపించి మందు యిప్పిస్తాడు.

టైఫాయిడువంటి కేసులలో కొన్ని రోజులు ప్రమాదకరమైనవే. ఇటువంటి పరిస్థితులలో గృహస్థు ఎన్ని రోజులని సెలవు తీసుకోగలుగుతాడు! ఇంట్లో ఎవరిమీద ఈ భారము మోపి వెళ్లగలడు! ఒంటరి సంసారాలలో - పట్నవాసపు కాపురాలలో గృహిణి వ్యాధిగ్రస్తురాలయితే గృహస్థుకు, ఇంట్లో ఉన్నంతసేపూ కచేరిమీద ధ్యానము, కచేరీలో ఉన్నంతసేపూ ఇంటిమీద ధ్యానము. ఆ జీతపురాళ్లు సక్రమముగా తెచ్చి ఇంట్లో పడేస్తేనే ఆ సంసారము నడుస్తుంది. ఇల్లాలు మంచములో ఉన్నా, పిల్లలు చేతయినటుగా ఇంత వండుకొని తిని పాఠశాలలకు వెళ్తారు. రోగిపరిస్థితి ఆదుర్దాగా లేదని ఎవరి పనులమీద వాళ్ళు వెళ్లితే, ఉదయాస్తమానాలు పని చేయటానికి నౌకర్లను నియమించుకోలేని కుటుంబాలలో గృహిణి పరిస్థితి ఊహించరానిదిగా ఉంటుంది. వైద్యమూ ఉపచారమూ ఎవరికి వారు చేసుకోవలసినదే. ఇంట్లో ఇటువంటి ఇబ్బందులు పడలేక, ఏ వైద్యాలయములోనో రోగిని చేర్పటానికి పరిస్థితులు అందరికీ ఒక విధముగా ఉండవు. పసిపిల్ల ఎడపిల్లలు తల్లిని వదిలి ఉండలేరు. పెద్దపిల్లలు తల్లి సలహా తీసుకోనిదే పనిపాటలు చేసుకోలేరు.

పెనిమిటి ఇంటలేని సమయాలలో, చేతి బిడ్డకుగానీ ఎడబిడ్డకుగానీ ప్రమాదము కలిగినా, వ్యాధి ప్రమాదించినా, గృహిణికి తక్షణమే వైద్య సహాయము ఎట్లా లభిస్తుంది? ప్రతి యింటా రోగులకు కావలసిన పరికరాలు వస్తువులు ఉంచటానికి సాధ్యమా?

ఈ సమస్యలలో కొన్ని, రోగిని వెంటనే వైద్యాలయాలలో చేర్పితే పరిష్కారమవుతాయి. ఆ విధముగా చేర్పని పక్షములో, సామాన్య సంసారి ఇంటిబాధలే కాకుండా ఆర్థికముగా కూడా ఇబ్బంది పడవలసిన వాడవుతున్నాడు. సామాన్య సంసారాలలో ఒక దీర్ఘవ్యాధి ప్రవేశించిందంటే, ఆ కుటుంబాలు నేల మట్టమయినట్టే. ఈ దృష్టితో, మన దేశములో ప్రభుత్వ వైద్యాలయాలలో పేదవారికి ఉచితముగా వైద్యోపచారాలు లభించటానికి వీలు కల్పించబడ్డది. సాధ్యమైనంతవరకూ వైద్యాలయాలసంఖ్య అధికము చేయబడ్డది. ఇటీవల ప్రభుత్వోద్యోగులకూ, వారి కుటుంబాలకూ ప్రభుత్వ వైద్యాలయాలలో వైద్యోపచారాల కయ్యేఖర్చు, ప్రభుత్వము భరించటానికి పూనుకొన్నది. కాని సామాన్య కుటుంబాల అవసరాలను తీర్చజాలినన్ని వసతులు లేవు. ఈ చిక్కులవల్ల సాధారణముగా గృహిణులకు వచ్చినవ్యాధులు సమూలముగా నయమయ్యే అవకాశాలు లేవనే

చెప్పవచ్చు. గర్భిణీగా వున్నప్పుడు కూడా తీసుకోనవలసిన జాగ్రతలను గురించి కూడా అవకాశాలు తక్కువగానే ఉన్నాయి.

సామాన్యసంసారులను ఇటువంటి ఇబ్బందులనుండి తప్పించటానికి ఏవైనా మార్గాలు ప్రణాళికలూ సాధ్యమా అని యోచిస్తే కనపడకపోవు.

జబ్బుచేసినప్పుడు వైద్యులకూ, వైద్యాలయాలకూ రోగులు పైకము చెల్లించ నవసరములేదు. రోగికీ వైద్యోపచారాలకూ మధ్య డబ్బువిచారము ఉండదు. ఆరోగ్యరక్షణకు వైయక్తికమైన పేదరికముతో గాని ఐశ్వర్యముతో గాని సంబంధము లేదు. సంపూర్ణారోగ్యము సకలమానవులకూ జన్మహక్కు! ఇది ఒక ప్రణాళిక.

వైద్యము చేయించుకోటానికి చేత కాసులేని కారణముచేత, అప్పులనుపోగొట్టుకోనవలసివచ్చిన సామాన్య ప్రజానీకానికి పై వాక్యాలు అమృతోపమానముగా వుంటాయి. ఆకలికి నకనకలాడుతూ, వెన్నుకంటుకొనిపోయిన కడుపులతో, కుష్కించిన దేహాలతో, ఉస్సురనే మానవాళికి జీవితాశలు చిగిర్చి పుష్పిస్తాయి. సమాజములో పైకి యెక్కలేక - క్రిందికి దిగలేక త్రిశంకు స్వర్గములోవున్న మధ్యతరగతి కుటుంబాలకు స్వర్గముప్రాప్తించినట్లుంటుంది. రెండు కాన్పులతోనే స్త్రీలు తమ ఆరోగ్యాన్ని కోల్పోక దృఢశరీరాలతో కలకలలాడుతూ ఉంటారు.

ఇంతకూ యీ విషయము స్వప్నోదంతమో - కట్టుకథోనని మనకు తోచినా వాస్తవమైనదే. 'మాజాతిని ఉద్ధరించి దేశాన్ని అభివృద్ధిచేసుకోటానికి మేము ఒక ప్రణాళికను సిద్ధము చేసుకొన్నాము; జాతీయారోగ్యసమితిని వ్యవస్థీకరించుకున్నాము' అని బ్రిటను దేశము ముందుకువచ్చి తెలుపుతున్నది.

ప్రతిమనిషికీ స్త్రీపురుష వయోవివక్షత లేకుండా, ఆర్థికవిచారణ గాని, స్థలనిర్దేశము గాని లేకుండా సకలవైద్యోపచారాలుఅందుబాటు చేయవలెనని జాతీయారోగ్య సేవా సమితిప్రథానాశయము. ఇది1948లో ఇంగ్లండులోఅమలులోనికి వచ్చిన చట్టము.

సైన్య రక్షణా ఆహారోత్పత్తీ దేశానికి ఎంత అవసరమూ ముఖ్యమో, ప్రజారోగ్య సంరక్షణకూడా అంతే. ప్రజలు పన్నులు చెల్లించుతూ దేశసంరక్షణభారాన్ని వహించినట్లే, ఆరోగ్య సంరక్షణకు కూడా పూనుకోవాలి. ఈ నూతన సంస్కారాన్ని ప్రవేశపెటటమే కాకుండా, వ్యక్తిగత స్వాతంత్ర్యాన్ని కాపాడటము కూడా ఈ చట్ట లక్ష్యాలలో ఒకటి. జాతీయారోగ్య సేవా సమితిని ప్రజలు వారి వారి అవసరాల ననుసరించి ఉపయోగించుకోవచ్చు. ఆ సమితి వల్ల ఎంతలాభము పొందదలచుకొంటే అంతే పొందవచ్చు. ప్రజలు ఎవరికి వారు తమ వీలు ననుసరించి ఒక వైద్యుని తమ కుటుంబ వైద్యోపచారాల నిమిత్తము నియమించుకోవచ్చు. లేక వైద్యాలయాలలో ఉపచారము పొందినా పొందవచ్చు. ఈ విధముగానే ఈ సమితిలో పనిచేసే వారికి కూడా ఏ విధమైన నిర్బంధమూ లేదు. వైద్యులు, వైద్యములో ప్రత్యేక పట్టము కలవారు, ఇతర ఉద్యోగాలలో పనిచేస్తున్న స్త్రీపురుషులు ఈ సమితిలో పని చేసినా తమవృత్తి ధర్మాలను నిర్వహించుకోవచ్చు.

ఈ ఉద్యమములో వైద్యులు, మందులను తయారుచేసే ఫార్మసీలు యథాశక్తిగా పాల్గొంటాయి. ఈ సంస్థ ప్రజలచే వ్యవస్థీకరింపబడి వారిచేతనే నడుపబడుతున్నది. ఈ సమితి ఉత్తమాశయాలతో స్థాపింపబడి, సక్రమముగా ఉద్యమిస్తున్నదను విశ్వాసము ప్రభుత్వానికి కలిగించే బాధ్యత ప్రజలదీ, పత్రికలదీ, పార్లమెంటుదీను. అటు ప్రభుత్వాన్ని ఆకర్షించుతూ, ఇటు సమితికి సహకరించటములో ఈ మూడు సంస్థలూ సమిష్టిగా కృషిచేయవలసినవి.

జాతీయారోగ్యోద్యమము సాంఘిక చట్ట కార్యక్రమాలలో చేరినది. నేషనల్ ఇన్సూరెన్సు, నేషనల్ ఎసిస్టెన్సు అట్టివికూడా సాంఘిక చట్టములోని భాగాలే. ఏ దేశములోనయినా జాతీయోద్యమాలు సఫలము కావలెనంటే ప్రజలు సాహసించి పురోగమించాలి; ఉద్రేకోత్సాహాలతో కృషిచేయాలి. ఇటువంటి ఉద్యమాలను వ్యవస్థీకరించటానికీ, వాటిని కొనసాగించటానికీ ధనము ప్రధానమైనది దీనికి కావలసినంత పైకము ప్రజలదగ్గర గాని ప్రభుత్వముదగ్గర గాని ఉండదు. వీటి భారము ఎవరూ విడివిడిగా వహించలేరు. అన్ని ఉద్యమాలలోకీ జాతీయారోగ్యోద్యమము మహాసముద్రము వంటిది. అపారమైనధనము చేతిలో ఉంటేనే గాని దీని కార్యక్రమాలు సాగవు. ఈ కారణముచేత ఈ ఉద్యమములో పనిచేసే కార్యకర్తలు ద్రవ్యార్జనోపాయాలను అన్వేషించుతూ ఉండాలి. కార్యకర్తలే కాకుండా దేశములోని ప్రజలందరి సహకారమూ ఈ ఉద్యమానికి బలాన్ని చేకూర్పుతుంది.

అన్ని దేశాలవలెనే బ్రిటను కూడా యుద్ధమువల్ల సర్వనాశనమయింది. దేశము తిరిగి స్వశక్తిని సంపాదించటానికీ, పురోగమించటానికీ, పునర్నిర్మాణ కార్యక్రమాలతో ఉత్పత్తిని వృద్ధిచేసుకోవటము మొదట చేయవలసినపని. ఈవిధానాన్ని అనుసరించటములో బ్రిటను వినూత్న కార్యక్రమాలను కొన్నిటిని కనిపెట్టింది. వాటిలో జాతీయారోగ్యోద్యమము ఒకటి. 1948లో బ్రిటనుకు అప్పటి అవకాశాలను బట్టి వ్యవస్థీకరింప బడ్డది.

యుద్ధానంతరము బ్రిటనులో వైద్యాలయాలలో పనిచేసే వైద్యులూ నర్సులూ స్వల్ప సంఖ్యాకులైనారు. కేవలము ఔషధానికీ సలహాలకూ అక్కడికి వచ్చే రోగుల సంఖ్య నానాటికి పెరుగుతూ వచ్చింది. అవసరాలకు తగినట్టుగా పెద్ద పెద్ద వైద్యాలయాలను వెంటనే నిర్మించి, వైద్యులను నర్సులను నియమించటానికి సాధ్యము కాలేదు. అందుచేత ఔషధము వైద్యాలయాలకు మాత్రమే సంబంధించినదైపోయింది. కార్మికులలో భీమా చేయించుకొన్న వారికే వైద్యాలయాలలో ఉచిత సౌకర్యాలు లభించేవి. వారి కుటుంబాలు వైద్య సౌకర్యాలు లేక అల్లాడిపోయేవారు. ఆసందర్భాలలో వారి స్థితిగతులకు తగిన వైద్యునివద్ద మందు తీసుకోవటమో, వైద్యాలయాలలో చేరి ధనము చెల్లించటమో చేయవలసివచ్చేది. మధ్య తరగతి కుటుంబాలు భీమా చేసుకున్నప్పటికీ క్షయవంటి దీర్ఘవ్యాధులు వచ్చినప్పుడు, శస్త్రచికిత్సలు అవసరమయినప్పుడు, ఖర్చులను భరించలేకపోయేవి. ఈ పరిస్థితులలో ప్రజా రక్షణ కొరకు అనేక సంస్థలు స్థాపింపబడ్డాయి.

ఈ సంస్థలు ఒక్కొక్కటి ఒక్కొక్క విధానము నవలంబించి ప్రజాసేవ చేసినట్లయితే ప్రజలఅవసరాలు తీరుతూ వుండేవి. కాని - అట్లా జరగలేదు. అన్నిటికీ ఇంచుమించుగా ఒకేవిధానమైన కార్యక్రమము - దానిని నెరవేర్చలేక బాధపడుతూ వుండేవి. ఈసంస్థలలోకూడా వైద్యులు వైద్యాలయాలకంటె తమ యింటికువచ్చి అధికముగా పైకము ముట్టచెప్పే రోగులనే శ్రద్ధగా చూచేవారు. నిపుణులైనవైద్యులు కేవలము ఆర్థికదృష్టితో నగరాలలోతప్ప నివసించేవారుకాదు. వారి వైద్యోపచారాలు ధనికులకుతప్ప సామాన్యులకు లభించేవి కావు. ఆపరిస్థితులు ప్రస్తుతము మనదేశములోవున్న పరిస్థితులను పోలినవన్నమాట.

ఈ సమయములో దేశ పరిస్థితులను చక్కగా పరిశీలించి జాతీయారోగ్య సేవాసమితిని వ్యవస్థీకరించారు. వ్యాధిగ్రస్థులు వైద్యాలయాలకు పైకము చెల్లించ నవసరములేకుండాను, రోగికీ వైద్యోపచారాలకుమధ్య డబ్బువిచారము లేకుండాను ప్రజలు రక్షింపబడ్డారు. ఐశ్వర్యముగాని పేదరికముగాని ఆరోగ్య సంరక్షణలో విభేదాలను కల్పించకుండా ప్రజలు కాపాడబడ్డారు.

# ★ జాతీయారోగ్య సేవాసమితి ★

ఈ సౌకర్యాలను వారు ఏ విధముగా సమకూర్చ గలిగారన్నదే ఆశ్చర్యకరముగా ఉంటుంది. ఉచితముగా ప్రజలకు వైద్యోపచారాలు జరుపుతున్నట్టుగా పైకి కనబడుతున్నదేగాని వాటికయిన ఖర్చులు ప్రజలే చెల్లించుకుంటున్నారు. అప్పటికప్పుడు ప్రతివ్యక్తీ విడిగా చెల్లించటము లేదుగాని, అందరూ పన్నులరూపములో ఇస్తూనే ఉన్నారు. సమష్టిగా ఈ సమితికి పైకము చెల్లించబడుతున్న కారణముచేత ఏ సమయములో ఎవరికి అవసరమువచ్చినా, వైద్యోపచారాలు తక్షణమే లభించే అవకాశాలు కల్పింపబడ్డాయి. రోగికి ప్రాణముమీదికి వచ్చినప్పుడు బేరసారాలుచేస్తూ వైద్యులు తమ దృష్టిని మళ్లించుకోవటమన్నది తొలగింపబడ్డది.

జాతీయారోగ్యోద్యమము క్రింద అయే ఖర్చు మొత్తముమీద సగటున ఒక్కొక్కరికి వారానికి అర క్రౌను క్రింద లెక్కబడ్డది. దీనివలన ప్రజలకు ఏ విధముగా మోచినా భారమనిపించ లేదు. ఈ ధనముతో ప్రతి వ్యక్తికీ ఆరోగ్య సంరక్షణచేసి, వ్యాధులను అరికట్టవలెనని ఉద్యమముయొక్క ప్రధానోద్దేశ్యము.

ఈ సంస్థ అందరికీ సంబంధించినట్టు కనబడుతుంది గాని దీని సంపూర్ణమైన భారము ఎవరికీ లేదు. ప్రజలందరూ ఏకమై కోరిన సౌకర్యాలను, విధానాలను ప్రవేశపెట్టవచ్చు. ప్రజలందరికీ తరతమ భేదాలు లేకుండా వైద్యోపచారాలు జరుగుతాయి. వైద్యాలయాలలో ప్రత్యేక సౌకర్యము కావలెననుకొంటే చేసుకోవచ్చు. కంటి వైద్యము, పంటివైద్యము రోగులకు ప్రీతిపాత్రులయిన వారిచేత చేయించుకోవచ్చు. వైద్యాలయాలలో ఉండి ఉపచారము పొందుతూ కోరిన వైద్యులను పిలిపించుకోవచ్చు. ఇక్కడ పనిచేసే వైద్యులు ప్రయివేటుగాకూడా, అవసరమనుకొంటే తమ వృత్తులను నిర్వహించుకోవచ్చు.

దీనికంతటికీ వైద్యపుఖర్చు ప్రధానముగా పన్నులరూపములో వసూలు చేయబడుతుంది. కొంత మొత్తము భీమాకంపెనీల నుండి సేకరించబడుతుంది కాని ప్రతివ్యక్తీ భీమా చేసి తీరవలెనన్న నిర్బంధము లేదు. కొంత సొమ్ము ప్రభుత్వమువద్దనుండీ కూడా వసూలు చేయబడుతున్నది.

ఈ సమితి వైద్యాలయాలలో కృత్రిమావయవాల అమరకము, ఎవరికయినా ఇళ్ళవద్దనే వైద్యోపచారాలు అవసరమయితే కల్పించటము, రోగులను అంబులెన్సు కారులో ఇండ్లకు పంపటము, జరుగుతూ ఉంటాయి. టెలిఫోను రాగానే వెంటనే, ఏ మారుమూల రోగులు ఉన్నప్పటికీ, అంబులెన్సు కారులో వైద్యాలయాలకు చేర్చబడతారు. ఇంటివారు రోగిని వైద్యాలయానికి పంపి నిశ్చింతగా ఉండవచ్చు. పసిబిడ్డ తల్లులు, గర్భిణీ స్త్రీలు అవసరాలకు తగిన జాగ్రత్తలు ఎప్పటికప్పుడు పొందగలుగుతారు. బిడ్డల బాధ్యత ఇళ్ళల్లో ఉన్నంతవరకే తల్లిదండ్రులది; తరువాత విద్యార్థి దశలో పాఠశాలాధికారుల బాధ్యతగా మారిపోతుంది.

ఈ ఆరోగ్యోద్యమము కల్పించిన సౌకర్యాలలో కొన్నిటిని మన దేశములో కూడా సంక్షేమ కార్యక్రమాలు సూక్ష్మముగా గ్రామాలలో కల్పిస్తున్నాయి. కాని ప్రజావసరాలకు తగినంత విస్తృతముగా ప్రణాళిక ఏర్పడినట్లయితే మన దేశములోకూడా ప్రజలందరూ ఆరోగ్యసంపదతో కలకలలాడుతూ ఉంటారు. మనకుకూడా త్వరలోనే జాతీయారోగ్య సేవాసమితివంటి సంస్థలు ఏర్పడే అవకాశము కలుగుతుందని ఆశిద్దాము. ★



డాలాక్విజ్ పోటీకి సంబంధించిన 18 ప్రశ్నలూ పరిశీలించి తుది నిర్ణయాలు చేసిన బృందం: శ్రీమతి పుష్పా వరీన్ (అధ్యక్షురాలు), కర్నల్ అమీర్ చంద్ (భారత వైద్యమండలి ప్రధాన కార్యదర్శి) శ్రీమతి ఎస్. నటరాజన్, శ్రీమతి హన్నాసేన్ (లేడీఇర్విన్ కళాశాల మాజీ ప్రిన్సిపాల్), శ్రీ నిర్మల్ సి. ఘోష్, (భారతీయ ప్రాచ్య పత్రికల సంఘం అధ్యక్షుడు.)




# పాప వేసిన తమాషా

జంధ్యాల సుబ్రహ్మణ్య శర్మ

"అమ్మా! మే మీనాడు
ఆడుకొనుచుండ - ఓ
పిల్లేమొ కాల్జారి
పడిపోయెనమ్మ!

పిల్లలెల్లరు చూచి
గొల్లుమని నవ్వ నా
పిల్ల చాలా సిగ్గు
పడినదే అమ్మ!

నే నొక్కదానినే
నవ్వలేదమ్మా!
నా కెంతో జాలేసె
నవ్వు రాలేదమ్మ!"

ఈరీతిగా పాప
అమ్మతో చెప్పగా
అమ్మెంతో మెచ్చుకొని
అందిట్లు పాపతో:

"ఎవ్వరమ్మా పాప,
ఆ పడిన పాప?
ఆ పాప పేరేమి?
చెప్పవే పాప."

పాప యీ మాటలకు
పక్కుమని నవ్వింది.
కిలకిలా నవ్వుతూ
పలికింది యీరీతి:

"అమ్మ కనుగొనలేవె
ఆ పాప నేనేనె.
నా కందుచేతనే
నవ్వు రాలేదమ్మ!"

అను పాప మాటలకు
అమ్మకూడా నవ్వె.
పాప అపు డాగకే
పకపకా నవ్వె.

2-11-55




# చిలుక, పిల్లి

మచ్చికైన చిలుకను కొని
తెచ్చినట్టి పౌరు డొకడు
ఇచ్చ వచ్చినట్లు తిరుగ
నిచ్చె దాని నింటిలోన.

పచ్చని తన రెక్కలార్చి
నిచ్చలు రాచిలుక ముదము
హెచ్చగ నా యింటి లోన
విచ్చల విడి విహరించును.

చిలుక ఎపుడు చూచిన సరి
చిలుక కొయ్య మీది కెగిరి
కిల కిల మని తులుకుచుండు
కలరవమున పలుకుచుండు.

ఇంటి నుండి మింటికెగిరి
మింటి నుండి మంటికి దిగి.
ఒంటరిగా కూరుచుండి
తుంటరి వలె గోలచేయును.

చిలుకల కొర కెల్లప్పుడు
కలుగుల కడ తిరుగు పిల్లి
చిలుక తీరు చిలుక జోరు
పలుమారులు పరికించెను.

ఎట్టులైన నాచిలుకను
గుట్టు చప్పు డవనిరీతి
పట్టివైచి మట్టు పెట్టి
పొట్ట నింపుకో నెంచెను.

తెలివి గలది యగుటచేత
చిలుక దాని ఎత్తు లెరిగి
మెలకువతో దూరముగా
తొలగి తొలగి తిరుగుచుండు.

ఒక్కనాడు మార్జాలము
అక్కసు నిక పట్టలేక
మిక్కుట మగు నాగ్రహమున
నిక్కరణిని చిలుక నడిగె:

"ఎక్కడిదానవె చిలుకా!
ఇక్కడి కెటు వచ్చితివే?
టక్కులాడి వోలె ఇంత
తక్కులాడు చున్నావే?"

కల కల నగి నిర్భయమ్ముగ
చిలుక పలికె పిల్లితోడ:
నెల క్రితమే యజమానుడు
విలిచె నన్ను సంతలోన."

"సరి సరి అది యా నీ కథ?
పరదేశపు చిలుక వయ్యు
వెరపు లేక అస్తమాన
మరచుచుంటి వింటిలోన.

ఇచ్చటనే పుట్టి పెరిగి
ఇచ్చటనే ఉన్న నాకు
ఇచ్చ వచ్చి నట్లు తిరుగు
స్వేచ్ఛ లేదు ఈ గృహమున.

ఇన్నాళ్లుగ ఇల్లు కాచు
కున్న నేను మ్యావు మ్యావు
మన్న చాల మంది పడుచు
తన్ని పంపు యజమానుడు.

నిన్న మొన్న వచ్చినట్టి
నిన్ను కొంచె మదలించక
చిన్న నాటి నుండి యున్న
న న్నదల్పు టేమి నీతి?"

అంత చిలుక అన్న దిట్లు:
శాంతించుము పిల్లి బావ!
ఇంతమాత్ర మెరుగవ, నీ
గొంతుకేడ్చినట్టులుండు.



నండూరి రామమోహనరావు



నీవు మ్యావుమనుట వినుట
కేవగించుకొనును గాని
నా వాక్కుల నతడు ప్రీతి
**తో విని యానందించును.**

మన కిరువురి కిదె భేదము
కనుక నీవు ఇల్లు విడిచి
చనుట యొకటె గత్యంతర
**మని సలహా చెప్పినది.**

బాలసాహితి సీరియల్

# మార్టిన్ రాట్లర్

మూలం: ఆర్. ఎమ్. బాలన్‌టైన్

అనువాదం: నండూరి రామమోహనరావు

## 10

మరునాటి ఉదయం మార్టిన్ రాట్లర్ నిద్రలేచే టప్పటికి బాగా బలహీనంగా ఉన్నాడు. తల తేలిక్కైపోయి ఎక్కడికో తేలిపోతున్నట్లున్నది. కుడి వైపు తల తిప్పి చూశాడు. గదిఅవతల చివర మరొక ఉయ్యాల కట్టిఉన్నది. అది సన్యాసి తాలూకు శయ్య అని మార్టిన్ గ్రహించాడు. అది ఇప్పుడు ఖాళీగా ఉన్నది. రెండో వైపున ఉయ్యాల చూడకుండానే అందులో బార్కీ ఉన్నాడని మార్టిన్ గ్రహించాడు. కొమ్ముబూరావలె బిగ్గరగా కుటీరం ఎగిరిపోయేట్టు గురకపెడుతూ బార్కీ ఇంకా గాఢనిద్రలో మునిగి ఉన్నాడు. అందుచేత అటు చూడకుండానే మార్టిన్ బార్కీ ఉనికిని గ్రహించాడు. ఒకవేళ తల అటు తిప్పాలన్నా తిప్పలేని స్థితిలో ఉన్నాడు. వంట్లో వీసమైనా సత్తువ లేదు. ఇంత హఠాత్తుగా తాను బలహీనుడైపోవడానికి కారణ మేమిటా అని అతడు ఆశ్చర్యపడుతుండగా, సన్యాసి బుజాలమీద ఒక లేడి పిల్లను వేసుకుని కుటీరంలోకి వచ్చాడు. తుపాకి ఒక మూల గోడకి ఆనించి అతడు మార్టిన్ దగ్గిరికి వచ్చాడు.

"అదేమిటబ్బాయ్, అలా ఉన్నావేం, ఏమైంది?" అని ఆశ్చర్యపోతూ అడిగాడు.

"ఏమి జరిగిందో తెలియడం లేదు. నా కాళ్లు తడితడిగా ఉన్నాయి, చూడండి" అన్నాడు మార్టిన్.

దుప్పటి తొలగించి సన్యాసి మార్టిన్ కాళ్లు చూశాడు. నెత్తురు పొరలి పొరలి వస్తున్నది. సన్యాసి నిర్ఘాంతపోయి, పోర్చుగీసు భాషలో క్రోధంగా ఏదో అన్నాడు. అతని మాటలకు బార్కీ ఉలిక్కిపడి లేచాడు. పెద్దపులిలాగా ఉయ్యాలనుండి దూకి "నే నిక్కడ ఉండగానే, నా కళ్ళ యెదటే నా స్నేహితుణ్ణి ఖూనీ చేస్తావ్రటా" అంటూ సన్యాసిని మెడబట్టుకుని ద్వారంలోంచి అవతలకు గెంటివేయబోయాడు. మార్టిన్ "బార్కీ! ఆగు ఆగు, ఏం లేదు, ఏం లేదు ఊరుకో" అని వారించకపోతే అంత బలిష్ఠుడైన మనిషినీ బార్కీ అవతలకు తోసివేసేవాడు. మార్టిన్ మాటలతో శాంతించాడు. "ఏం జరిగింది నా బాబూ" అని తల్లి పిల్లవాణ్ణి వాత్సల్యంతో అడిగినట్టు ఆదుర్దాగా అడిగాడు.

బార్కీ తనమీద చెయ్యి చేసుకున్నా, కాస్త కూడా చలించక సన్యాసి ఇలా చెప్పాడు: "పాపం ఈ బాలుణ్ణి దయ్యపు గబ్బిలం కరిచి నెత్తురు పీల్చివేసింది"

"ఆ" అంటూ బార్కీ బల్లమీద కూలబడి సన్యాసికేసి భయభ్రాంతుడై చూశాడు.

"అవును. ఇది దయ్యపు గబ్బిలం చేసిన పనే. బ్రెజిల్ దేశంలో ఇంత ఘోరమైన ప్రమాదం తెచ్చి

పెట్టే జంతువు మరొకటి లేదు. మనుషుల్ని, పశువుల్ని ఈ గబ్బిలాలు పొడిచి నెత్తురు పీల్చేస్తాయి. నా పశువులన్నీ చచ్చిపోడానికి సిద్ధంగా ఉన్నాయి, వీటివల్లే."

బార్నీ మళ్ళీ "ఊ" అని మూలిగాడు.

"అవును. రెండు ఆవుల్ని చంపేశాయి. ఇంకో గుర్రాన్ని చంపేశాయి. ఇప్పుడు నాదగ్గిర ఒక పశువైనా లేదు."

బార్నీ మళ్ళీ మూలిగాడు. సన్యాసి ఇంకా ఉత్సాహంగా దయ్యపు గబ్బిలాలు చేసిన పైశాచిక చర్యలన్నీ ఏకరువుపెడుతూ, ఏవో మూలికలు తీసి రసం పిండి, నెత్తురు కారకుండా ఆపడానికి మార్టిన్ కాలిబాటన వేలికి రాసి, కట్టు కట్టాడు. తరవాత కూర్చుని, అసలు గబ్బిలం ఏవిధంగా ఈ దారుణం చేస్తుందో వివరించాడు. దయ్యపు గబ్బిలాలు పెద్ద పెద్దవిగా, భయంకరంగా ఉంటాయి. గుర్రాలను, పశువులను నెత్తురు పీల్చి చంపుతాయి. అయితే ఒక్కసారిగా చంపలేవు. మళ్ళీ మళ్ళీ వచ్చి, కరిచి నెత్తురు తాగుతాయి. అవి చేసిన గాయాలు ఎంతకీ మానవు. వాటినుండి రక్తం అలాగే స్రవిస్తూఉంటుంది క్రమంగా రక్తమంతా కారిపోతూ జంతువులు కృశించి మర

ణేస్తాయి. మార్టిన్‌కు జరిగినదాన్నిబట్టి అవి మనుషులను కూడా కరుస్తాయని వేరే చెప్పనక్కర్లేదు. బొటనవేళ్ళవంటి చివరభాగాలనే ఎంచుకుని అక్కడే కరుస్తాయి. ఎంత సున్నితంగా కరుస్తాయంటే, అవి రంధ్రం చేసినప్పుడు నిద్రపోతున్నవాళ్ళకు చీమకుట్టినట్లయినా ఉండదు. అలా రాత్రంతా అవి నిరాటంకంగా నెత్తురు తాగుతాయి. తెల్లారి ఆ మనిషి లేచేసరికి బాగా బలహీనంగా ఉంటాడు. గబ్బిలాలకి వాడియైన పళ్లు కూడా ఉంటాయి. నెత్తురు తాగేందుకు వీలుగా నాలుకమీద ఏవో చిన్న చిన్న అవయవాలుంటాయి. ఆకుమాదిరిగా వేలాడే చిత్రమైన పెదవి ఉంటుంది.

ఈ వివరాలన్నీ చెప్పి సన్యాసి తనదగ్గర అలాంటి గబ్బిలం ఒకటి చచ్చిపోయినది ఉన్నదని చూపించాడు. అది గోడకు మేకులతో కొట్టబడి ఉన్నది. బారచాచబడిన దాని రెక్కలు అటునుంచి ఇటు రెండడుగుల స్థలం ఆక్రమించాయి. దాన్ని బార్నీ పరీక్షగా చూసి "ఏమైతేనేం, మార్టిన్ నెత్తురంతా తాగేశాయి, వెధవ గబ్బిలాలు," అన్నాడు.

"ఫరవాలేదు మిత్రుడా! ఆమాత్రం నెత్తురు పోవడం మంచిదే. బాలుడు తేలికపడతాడు. రేపటికి ఈ గాయం పూర్తిగా మానిపోతుంది," అన్నాడు సన్యాసి.

"నిజంగానాండి? రేపటికే నయమవుతుందా! అయితే బతికాను. ఈ కొత్త దేశంలోకి రానేవచ్చాను. వచ్చి ఇక్కడి వింతలన్నీ చూడకుండా మూలపడ్డానంటే ఎంత బాధగా ఉండేదో? ఇందాకటికంటె ఇప్పుడు కొంచెం నయం. మీరు కాస్త దయ ఉంచి తింటానికేమైనా పెడితే కాస్త బలం చేకూరుతుంది."

సన్యాసి వెంటనే ఆహారపదార్థాలు తీసి బల్లమీద పెట్టి వడ్డించాడు. మార్టిన్‌ను నెమ్మదిగా లేవదీసి కుర్చీలో కూర్చోపెట్టాడు. ముగ్గురూ కూర్చుని ఆత్రంగా భోజనం చేయసాగారు.

సన్యాసి అమర్చిన ఆహారపదార్థాలలో రకరకాల చల్లని మాంసం, వేడివేడిగా అప్పుడే వండిన లేడి మాంసం ఉన్నాయి. మంచి కాఫీ, మీగడ, కేక్‌లు, అద్భుతమైన తేనె ఉన్నాయి. బార్నీ గబగబ నోటిలో కుక్కుకుంటూ, పదార్థాల రుచికి ఆనందిస్తూ "ఆహాహా! ఏమి భోజనమయ్యా! ఏమి పాకమయ్యా!" అని ఆశ్చర్యార్థకాలు పారేస్తూ, అప్పుడు జ్ఞాపకం వచ్చినట్టు సన్యాసిని పేరు అడిగాడు.

"నా పేరు కార్లస్" అన్నాడు సన్యాసి.

"మీకు పాడి సమృద్ధిగా ఉందా?" అని మార్టిన్ అడిగాడు.

"ఆవులుంటేగా పాడికి?"

"మరిఅయితే ఈ ఒకటో రకం మీగడ ఎక్కడిది?" అని మార్టిన్ ఆశ్చర్యపడ్డాడు.

సన్యాసి చిరునవ్వు నవ్వాడు "ఆ మీగడ ఒక చిత్రమైన ఆవుపాలనుండి వస్తుంది. ఆ ఆవు భూమిలో మొలుస్తుంది," అన్నాడు.

"మొలుస్తుందా?" అన్నారు మార్టిన్, బార్నీ.

"అవును. మీకు చూపిస్తాలెండి ఎప్పుడన్నా," అని తనలో తాను కులాసాగా నవ్వుకున్నాడు. "ఈ కాఫీ చెట్లనుండి వస్తుంది. ఈ దేశంనిండా ఎక్కడ చూసినా కాఫీ చెట్లే. బ్రెజిల్ నుండి ఎగుమతి అయ్యే వాటిలో కాఫీగింజలు ముఖ్యమైనవి. దానివల్ల ఇక్కడి వాళ్ళకి చాలా డబ్బు వస్తుంది. ఈ కేక్‌లను 'మెండియోకా' అనబడే ఒకరకం వేరునుండి తయారుచేశాను. ఈ వేరులు నా కుటీరంచుట్టూ బాగా పెంచుతున్నాను. ఆ వేరు తవ్వి తీసి ఎండబెట్టి, పిండికొట్టి దానితో ఈ కేక్‌లు తయారుచేస్తాను. ఈ దేశంలో * ఇండియన్లు, నీగ్రోలు ఈ వేరునే ముఖ్యాహారంగా వాడతారు."

"అయితే ఇక్కడ ఇండియన్లు, నీగ్రోలు ఉన్నారా?" అని బార్నీ అడిగాడు.

"ఆ, చాలామంది ఉన్నారు. నీగ్రోలలో ఎక్కువమంది బానిసలు. ఇండియన్లలో కూడా కొందరు బానిసలున్నారు. ఈ దేశానికి చాలాకాలం క్రితం వలసవచ్చిన పోర్చుగీసువారిసంతతివారు ఇక్కడ యజమానులు. అది సరే—ఈ తేనె చూశారా, ఇది చెట్లతొర్రల్లోంచి తీసుకొస్తాను. ఈ దేశంలో తేనెలు రకరకాలవి దొరుకుతాయి. ఒకరకం తేనె పుల్లగా

* రెడ్ ఇండియన్లు.

కూడా ఉంటుంది. ఇక ఈ పేరులు, అరటిపళ్ళు, కొబ్బరికాయలు, నారింజలు, ఇంకా ఇతర ఫలాలు అడవుల్లో కావలసినన్ని దొరుకుతాయి. ఇంకా ఏమేమిటో లతు దొరుకుతాయి. కొద్ది రోజులుంటే మీరే అన్నీ చూస్తారుగా."

బార్నీ మూతి తుడుచుకుంటూ "చాలా విచిత్రంగా ఉంది ఈ దేశం," అన్నాడు. గడ్డంమీద చెయ్యివేసి రాచుకుని సన్యాసిని అడిగాడు: "మిత్రుడా! నీదగ్గిర గడ్డం గీసుకునే కత్తి ఉందా?"

"లేదు. అలాంటి పిచ్చిపిచ్చి వస్తువులు నే నెప్పుడూ వాడను," అన్నాడు సన్యాసి.

"పోన్లే, ఫరవాలేదు. ఇక్కడ నన్ను చూసి నవ్వేందు కెవరున్నారు కోతులూ, పులులూ తప్ప. అయితే ఈ వెధవ మీసాలు మరీ రెండువారాలనుంచి పెరిగిఉన్నాయేమో, చిరాకుగా ఉన్నాయి."

బార్నీ పడుతున్న చిరాకు చూసి మార్టిన్ పకలబడి నవ్వాడు. "మరేం ముంచుకుపోయిందిలేదు లేవోయ్. గడ్డం, మీసాలు ఉంటే నువ్వు బాగుంటావు. పైగా, దోమలు కుట్టకుండా అవి కాపాడతాయి. నీకు గడ్డం పెరిగితే కళ్లు, ముక్కు తప్ప మిగతా ముఖం అంతా మూసుకుపోతుంది; కనుక దోమలు కుట్టడానికి వీలైనచోటు తక్కువై పోతుంది," అంటూ లేచి ఉయ్యాలలోకి ఎక్కి పడుకున్నాడు. సన్యాసిని చూసి "నన్నివ్వాళ మీరు బయటికి కదలనివ్వరు గనుక ఈ వింత దేశపు విశేషాలన్నీ చెప్పండి, వినాలనుంది," అన్నాడు.

"మీకు అభ్యంతరం లేకపోతే మీగురించి కూడా చెప్పండి, వింటాము. అసలు ఈ నిర్జనప్రదేశంలో మీరు ఏకాంతంగా ఎందుకు ఉంటున్నారు?" అని బార్నీ ప్రశ్నించాడు.

సన్యాసి ఇద్దర్నీ చూస్తూ గడ్డం నిమురుకున్నాడు. కుర్చీని గుమ్మందగ్గిరగా లాక్కుని, కూర్చుని, చేతులు కట్టుకుని, శూన్యంగా చెట్లకేసి, ఆకాశంకేసి చూశాడు. మళ్లీ తన అతిథులవంక ఒకసారి చూసి, తల పంకిస్తూ, "సరే. మీరు అడిగినది నా కథ కదూ, చెబుతాను."

"మీరు ఏమీ అనుకోకపోతే—" అని జంకుతూ చిరునవ్వు నవ్వి, జేబులోంచి పైపు తీసి "ఈ ప్రాంతాల్లో పొగాకులాంటి పదార్థం దొరుకుతుందా?" అని బార్నీ అడిగాడు.

సన్యాసి లేచి ఒక చిన్న పెట్టె తెరిచి ఒక చేత్తో కొన్ని పొగాకు ముక్కలు, మరొక చేత్తో దాదాపు అడుగు పొడుగున్న చుట్ట పట్టుకొచ్చాడు. మరి కొద్ది క్షణాలలో చుట్ట కర్మాగారపు పొగగొట్టంలాగా, బార్నీ పైపు ఓ చిన్న కొలిమిలాగా గుప్పుగుప్పున పని చేయసాగాయి. రెండిటినుండీ ధూమమేఘాలు బయలుదేరి కుటీరంలో దోమలు లేకుండా తరిమివేశాయి. మార్టిన్ ఉయ్యాలలో పడుకుని ఊగుతూ, జోగుతూ, ఆ ధూమమేఘాలలోనుండి దూరాన సూర్యకాంతి మెరిసిపోతున్న నారింజ వృక్షాలకేసి, కాఫీచెట్లకేసి, పొడుగాటి తాటిచెట్లు, అల్లిబిల్లిగా అల్లుకున్న లతాతోరణాలు, మధుర పరిమళాలు దిమ్మరిస్తున్న పుష్పగుచ్ఛాలకేసి చూస్తూ సన్యాసి చెప్పేది వింటున్నాడు. సన్యాసి ఒక పది నిమిషాలసేపైనా చుట్ట కాలుస్తూ, మధ్య మధ్య "ఆ, చెబుతాను, నా కథ చెబుతాను" అని గొణుక్కుంటూ గడిపి చివరికి మొదలుపెట్టాడు.

(ఇంకా వుంది)

# బెలూన్ దొంగలు

"సత్యశ్రీ"

వైదేహిని, 'తీర్థం'లోకి తీసుకెళ్లి అక్కడి వింతలన్నీ చూపించి, మునిమాపువేళకి యింటికి తీసుకొస్తూ, 'గేస్'తో నింపిన మూడు రబ్బరు బుడగల్ని కొనియిచ్చాడు తాతయ్య. మూడు దారాల్నీ కలిపి, వైదేహి చేతికిస్తూ "గట్టిగా పట్టుకో......! లేకపోతే ఎగిరిపోతాయి...!" అంటూ హెచ్చరించాడు కూడా. అందులో ఒకటి గులాబిరంగుది, రెండోది నీలవర్ణం, మూడోది రంగురంగు పువ్వులతో ఎంతో చక్కగా వుంది చూట్టానికి. ఈ పువ్వులున్న బుడగ ఎంతో నచ్చింది వైదేహికి. "అమ్మో!... ఎంచక్కా వుందో...?!"అనుకుంది.

తాతయ్య చెయ్యిపట్టకుని నడిపిస్తోంటే, ఒక చేత్తో బుడగలు పట్టుకుని మెల్లగా నడుస్తోంది... మూడు బుడగలూ కలిసి పైకి ఎగిరిపోడానికి పెనుగులాడుతోంటే, పిడికిలి బిగించి గట్టిగా క్రిందకి అణిచిపెట్టింది......అలా నడుస్తూ, నడుస్తూ ఏదో తట్టగానే"అమ్మో.." అనుకుంది మనస్సులోనే...

"ఈ మూడు బుడగలు కలిసి తన్ను పైకి...ఆకాశంలోకి ఎత్తుకుపోతే...? అమ్మో...! ఇంకేమన్నా వుందా...?!"

వైదేహి ఎంచక్కా వుంటుందనుకున్నారు...? ఎంతో అందంగా వుంటుంది...! ఎంతో చక్కగా మాట్లాడుతుంది. పట్టుపూల గౌను మీద, కుందేలుబొమ్మలున్న బుల్లి సిల్కు పరికిణీ వేసుకుంది.

అట్నా, యిటు బారులు తీర్చి, పేర్చివున్న దుకాణాలను చూస్తూ పరధ్యానంగా నడుస్తూండగా, పొరపాటున చేతిలోనుంచి ఒక బుడగ దారంతోసహా తప్పించుకుంది...! 'అయ్యో...!' అంది వైదేహి. తాతయ్య కూడా ప్రయత్నించాడు పట్టుకోడానికి...కాని దొరికితేగా..?

పైకి...యింకా పైకి......పోను పోను ఆకాశంలోకి పోయి అంతర్ధానమైపోయింది...!

వైదేహికి అది ఎగిరిపోతోంటే, కనిపించినంత మేరవరకు చూట్టానికి సరదాగా వున్నా, అంతర్ధానమై పోగానే తగని విచారం వేసింది... అందులోనూ ఎగిరిపోయింది తనకు యిష్టమైన పూలబుడగే...! బుల్లి బుల్లి పూలున్న బుడగే...!

"గట్టిగా పట్టుకోమని చెప్పలేదూ...?" అంటూ తాతయ్య గట్టిగా కసరేసరికి బిక్కమొగం వేసింది వైదేహి.

"ఛీ...! తాతయ్య ఎప్పుడూ యింతే...తనకు యిష్టమైన బుడగ పోయిందని, తను యిప్పటికే యిడవుతోంటే పైగా తాతయ్యొకడూ.. కసరడానికి......!" అనుకుంది. తాతయ్య చూడకుండా కళ్లు

చిట్లించి, బుల్లి పెదాలు ముడుచుకుంది...!

ఇక దారిలో ఏమీ మాట్లాడకుండా, తతిమా రెండు బుడగల్ని గట్టిగా పట్టుకుని యింటికొచ్చేసింది వైదేహి.

* * *

ఇంటికొచ్చినా, ఆ పువ్వుల బుడగమీదే వుంది వైదేహి మనస్సంతా. తతిమా రెండు బుడగల్ని పెరటిలో మల్లెపందిరికి కట్టి, అవి గాలిలో ఆడుతూ రెపరెపమని ధ్వనిచేస్తూంటే, వెన్నెల్లో అమ్మ ప్రక్కలో పడుకుని చూస్తూ వుండిపోయింది వింతగా...అయితే ఆ పూలబుడగ ఎక్కడికి ఎగిరిపోయిందో అర్థంగావటం లేదు ఎంత ఆలోచించినా..."అసలది ఎంతదూరం ఎగిరిపోతుందో...? ఎక్కడికి పోతుందో! ఎక్కడ వాలుతుందో...?" ఎంతో ఎంతో ఆలోచించింది......! ఊహూం...! ఏమీ తట్టలేదు...

ఆలోచించీ, ఆలోచించి, చివరకు అలిసిపోయింది వైదేహి. మెల్ల మెల్లగా కనురెప్పలు బరువెక్కాయి. తనకు తెలియకుండానే నిద్రపోయింది వైదేహి...!

ఆ నిద్రలో ఒక గమ్మత్తైన కల వచ్చింది వైదేహికి!

ఉన్నట్టుండి ఆకాశంలోనుంచి ఏదో విమానం దిగివస్తూన్నట్టుగా గమ్మత్తైన శబ్దం వినిపించింది కలలో......కలలోనే మెలకువ వచ్చింది వైదేహికి. ప్రక్కమీద నుంచి లేచి చూసేసరికి, అదేం విచిత్రమో గాని, ప్రక్క, తనవళ్ళు, బట్టలు...అక్కడి ప్రదేశమంతా కూడా నీలవర్ణంగా మారిపోయింది...! వైదేహి తన వళ్ళు చూచుకుని గాబరాపడిపోయింది...

"అరె...! యిదేవిటీ...తను యిలా మారిపోయిందేం చిత్రం...?" అంటూ లేచి ఆకాశంలోకిచూచింది.

ఆకాశంలోనుంచి ఏదో నీలి మబ్బు...అచ్చంగా రెక్కలరథంలా ఉంది. మెల్ల మెల్లగా దిగి పెరటిలో సంపెంగపొద ప్రక్కగా వాలింది. అందులోనుంచి యిద్దరు చక్కటి అమ్మాయిలు దిగారు.

"అమ్మో...! ఎంత చక్కగా వున్నారో...? అచ్చంగా తనలాగే వున్నారు..." అనుకుని ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయింది వైదేహి.

వాళ్ళిద్దరూ చప్పుడు చెయ్యకుండా, మెల్లగా అడుగులోఅడుగు వేసుకుంటూ, బెదురు బెదురుగా యిటే...ఈ మల్లెపొదకే నే వస్తూన్నారు...ఎందుకో మరి...?

అందులో ఒక అమ్మాయి చుక్కల చుక్కల గౌనువేసుకుంది. గిన్నెకోడిలా ఎంతో బుజ్జిగా, పొట్టిగా, అందంగా ఉంది. రెండో అమ్మాయి, రంగు రంగుల గౌను వేసుకుని నెమలిపిట్టలా వయ్యారంగా నడిచివస్తోంది...

"ఇదేమిటి...? వీళ్ళు ఇటువైపే వస్తున్నారు...! మల్లెపొద దగ్గర ఏంపని వీళ్ళకు...?" అనుకుని, వాళ్ళకు కనిపించకుండా ముందుగా మల్లెపొద చాటుగా వచ్చి, నక్కి నిలబడ్డది వైదేహి ఏమిజరుగుతుందో చూద్దామనే ఉద్దేశ్యంతో...

వాళ్లిద్దరూ మల్లెపొద దగ్గరికొచ్చి, బుల్లిచేతులతో నోరు గట్టిగా మూసుకుని, బెదురుతూ అటూ, యిటుచూచి, యికధైర్యంవచ్చేసినట్టు, ఆ మల్లెపొదకు కట్టిన బుడగల్ని విప్పబోయారు...!

ఇది చూడగానే వైదేహికిమహా చెడ్డకోపం వచ్చేసింది. "హమ్మ దొంగలు...! యిదా మీరుచేసే పని...? నేనేమిటో అనుకున్నాను.. వుండండి — వుండండి మీ పని చెబుతా..." అంటూ పొదచాటు నుంచి 'బుడుంగు' మని బయటికి వచ్చింది.

"ఏయ్...! ఎవరమ్మాయిలు మీరు...? దొంగతనం చేయటానికొచ్చారేం పాపం...? తాతయ్యను పిలిచానంటే దుడ్డుకర్రతీసుకొస్తాడు. తెలుసా...?"

అనేసరికి వాళ్ళిద్దరూ త్రుల్లిపడి గాబరాతో 'కెవ్వు' మని కేకవేసి ఒకర్ని ఒకరు కౌగలించుకున్నారు. వెంటనే వెనక్కి తిరిగి బుడగలు విప్పకుండా వకటేపరుగు...!

వైదేహి వాళ్ళ వెనకాల పడ్డది తరుముకుంటూ. అయితే వాళ్ళు దొరికితేగా...గబ గబా పరుగెత్తి వాళ్ళువచ్చిన రథం ఎక్కేరు... వైదేహికూడా పరుగెత్తుకొచ్చి, అది ఎగిరిపోతుందనగా, దాని రెక్క పట్టుకుని ఎక్కిపోయింది వెనకాల...!

ఆ రథం, 'రయ్యి' మంటూ ఆకాశంలోకి ఎగిరింది! ఇంకా, ఇంకా వెళ్ళిపోతూనే ఉంది...రంగు రంగుల మేఘాల్ని దూసుకు వెళ్ళిపోతోంది. మహావేగంగా ఎగిరిపోతోంది...

వైదేహికి కళ్ళుతిరిగిపోతూన్నై.. భయంవేస్తోంది.

"అమ్మో...క్రిందకు పడిపోతానేమో..." అనుకుంది.

కొంతసేపటికి వైదేహికి కళ్ళు చీకట్లు కమ్మాయి...స్పృహ తప్పిపోయ్యింది. తనకు తెలియకుండానే,

దాని రెక్కలమీద అలానే స్పృహ తప్పి పడిపోయింది...!

కొంతసేపటికి వైదేహికి తెలివి వచ్చి చూడగానే తను ఒకచక్కటి పచ్చికబయలుమీద పడుకుని ఉంది...! ఉలిక్కిపడి లేచికూర్చుండిపోయింది వైదేహి.

చుట్టూ, చక్కటి నీలికొండలున్నాయి...ఎన్నో రకరకాల పూలమొక్కలున్నాయి అక్కడ.. సిల్కుదారాల్లాటి గడ్డివుంది.

"ఇదేవిఁటి... తనిక్కడికెలా వచ్చింది...? [illegible] రథం, వాళ్ళూ ఏరీ...? ఓహో...! అదీ! తనకు కళ్లు తిరిగి దానిమీదనుంచి క్రిందికి పడిపోయి ఉంటుంది...ఇంకేముంది వాళ్ళు తప్పించుకున్నారన్నమాట. ఇంకా నయం...తనకి దెబ్బలేవీ తగల్లేదు...!"

అనుకుని, లేచి అటూ యిటూ చూచింది వైదేహి.

అక్కడ ఎవరూ లేరు-కనీసం పిట్టలుకూడా మాటాడ్డం లేదు. దూరంనుంచి మాత్రం చిన్నచిన్న సెలయేళ్ళు పారుతూన్న గల గల ధ్వని వినిపిస్తోంది. వెన్నెలమాత్రం బంగారుపూతలా దేదీప్యమానంగా కాస్తూంది...!

వైదేహి గాబరాగా ముందుకు నడిచింది. కొంతదూరం వెళ్ళగానే ఏదో పాట వినిపించేసరికి అటువైపు చూసింది.

కొంతదూరంలో, బుల్లి సెలయేటికి ప్రక్కగా, బండమీద కూర్చుని పాటపాడుతోంది ఒక కుందేలు...! ఆ కుందేలు తెల్లగా ఎంతో అందంగా వుంది చూట్టానికి. మధ్యమధ్య చీపురుపుల్లతో సబ్బు బుడగలు కూడా వదులుతోంది...!

ఇందాకతను వెంబడించిన యిద్దరమ్మాయిలు కూడా అక్కడే వున్నారు! అన్నిటికన్నా విచిత్రం ఏమిటంటే, తీర్థంలో ఎగిరిపోయిన బుడగ, అదే, ఆ పువ్వులున్న బుడగ...అచ్చంగా అలాంటిదే [illegible] కుందేలు చేతిలో వుంది!

ఆ యిద్దరమ్మాయిలను ఊరిస్తూ ఏదో పాటపాడుతూంది కుందేలు...!

ఒక అమ్మాయి బుడగ
ఎగిరిందోయ్...
ఎగిరీ ఎగిరీ వచ్చిందోయ్...!
వచ్చీ వచ్చీ వాలిందోయ్...
పొదలో నాకది
దొరికిందోయ్...!

ఆ పాట వినగానే వైదేహికి అర్థమైపోయింది సంగతంతా.

"అదీ సంగతి...! [illegible] యిద్దరమ్మాయిలుకూడా ఇక్కడే వున్నారే...? దీనికి దొరికిందన్నమాట తన బుడగ...! వుండు-వుండు - నీ పని చెబుతా...నీ మొఖానికి బుడగలు కూడానా...? పైగా సబ్బుబుడగలు వూదటం కూడా నేర్చుకుందే...?"

అంటూ, మెల్లగా కుందేలు వెనక్కాలకి వెళ్ళి నక్కింది వైదేహి! ఇప్పుడుదాన్ని ఎలాతీసుకోవాలి...? ముందుకెళ్ళి లాక్కుంటే. బెదిరి పారిపోతుంది...అమ్మో - కుందేలుతో తను పరుగెత్తగలదా...? ఆలోచించాలి...!

[illegible] కుందేలు యింకా ఏదో కోతలు కోస్తూనేవుంది ఆ యిద్దరమ్మాయిలతో.

"ఛీ! ఛీ..! మీరెందుకూ పనికిరారు...! పిరికిపందలు. ఛూ...! నేనైతేనా ఆ అమ్మాయిని బెదిరించి



మరి తెద్దును రెండు బుడగలూను...! పారిపోయి వచ్చారు... ఛీ..! ఛీ...!!"

మీసాలుదువ్వుకుంది కుందేలు-

"మహా చెప్పేవు లెద్దూ...! నువ్వయితే అక్కడే కళ్లు తిరిగి పడిపోదువు-ఆ అమ్మాయి గద్దించేసరికి ఎంత భయపడిపోయావో చెప్పలేం...!" అంటూ, చక్రాల్లాంటి కళ్లను గమ్మత్తుగా తిప్పుతూ వీపు చరుచుకుంది ఆ గిన్నెకోడి అమ్మాయి!

"ఇంకా నయం...! ఆ అమ్మాయి వెంట తరిమితే మేం గాబట్టి తప్పించుకుని గబగబా రథంలో వచ్చిపడ్డాం గాని...నువ్వయితే అసలు పరుగెత్తనే లేవు...అమ్మో... నాకెంత భయంవేసిం దనుకున్నావు..! జ్వరమొస్తుందేమో నాకు .!"అంది ఆ నెమలిపిట్టలా వుండే అమ్మాయి తన వళ్ళు చూచుకుంటూ..

వాళ్ల పిరికితనానికి నవ్వొచ్చింది వైదేహికి

"కుందేలు ఏదో కోస్తూందే...? దీని పని పట్టాలి!" అనుకుంటూ మెల్లగా, చప్పుడు చెయ్యకుండా లేచి, వెనుకనుంచి, కుందేలు చేతిలోని బుడగను గబుక్కున లాగేసుకుంది!

అదిరిపడ్డది కుందేలు - గాబరాలో 'చెంగు'మని ఒక్క దూకు దూకి, ప్రక్కనేవున్న నీటిగుంటలో పడి లేచింది. ఆ యిద్దరమ్మాయిలూ మొదటే భయపడిపోయి పొదల్లో దాక్కున్నారు.

"అమ్మయ్య...! యిక పరవాలేదు. తన బుడగ దొరికింది. పరుగెత్తాలి కుందేలు కందకుండా."

అంటూ వైదేహి వెనక్కి తిరిగి పరుగెత్తడం మొదలు పెట్టింది. అయితే కుందేలు తక్కువది కాదు. అదికూడా వెంటాడింది వైదేహిని..

ఎన్నో ఎన్నో చెట్లూ, గట్లు దాటుకుంటూ పరుగెత్తుతోంది వైదేహి...తోటలు, కొండలు సెలయేళ్ళు దాటుకుంటూ పరుగెత్తుతోంది. కుందేలు కూడా తరుముకుని వస్తోంది...!

అమ్మో...! వచ్చేస్తోంది...తను ఆలస్యం చెయ్యకూడదు...పరుగెత్తాలి...ఎలాగ...? కాళ్ళు నొప్పి పెడుతూన్నై...కళ్ళు తేలిపోతున్నాయి .. అయినాసరే దానికంద గూడదు..పరుగెత్తాలి...

పరుగెత్తి పరుగెత్తి, కాలికిచిన్న గడ్డిపొద కొట్టుకొని బోర్లా పడిపోయింది వైదేహి..అయినా చేతిలో బుడగ వదలలేదు.

"ఇంకేముంది ? కుందేలు దగ్గర కొచ్చేసింది...తను తొందరగా లేచి పరుగెత్తాలి...!"

లేవడంలో, కలలోనుంచి మెలకువ వచ్చిందేమో, నిజంగానే తన మంచంమీద లేచి కూర్చుండిపోయింది వైదేహి...పూర్తిగా ఇంకా నిద్రమత్తూ,కలమత్తూ వదలలేదేమో...ఒకచేతిని నిజంగా బుడగ పట్టుకున్నట్టే పట్టుకుంది యింకా.

అప్పటికి పూర్తిగా తెల్లవారింది. అమ్మ మల్లెపందిరిదగ్గర, పూజకు పువ్వులు కోస్తూంది..

వైదేహి మంచంమీద నుంచి లేచి, చేతిని అలాగేవుంచి మల్లె పందిరిదగ్గర కొచ్చింది. తను రాత్రి కట్టిన బుడగల్ని చూచుకోడానికి...

అమ్మ వైదేహినిచూచి నవ్వి అంది : "నేనురాత్రే చెప్పేనా... బుడగలు యిక్కడ కట్టొద్దని...! ఇంకా వుంటాయేమిటి...? గాలికి దారాన్ని తెంపుకుని ఎగిరిపోయాయి...! తాతయ్య తంతాడులే...!" అని.

ఇదివినగానే వైదేహికి పూర్తిగా మత్తు వదిలింది...ఉలిక్కిపడి తన చేతిని చూచుకుంది..ఏముంది అక్కడ...? ఉత్తినే పట్టుకున్న పిడికిలి ఉంది...! నిస్పృహతో మల్లె పందిరికేసి చూచింది వైదేహి... అక్కడకూడా సగం తెగిన దారపు ముక్కలు వేళ్లాడుతూన్నై.

వైదేహి ఆశ్చర్యపోయింది... "ఇదేమిటి...? ఏమయినై ఆ బుడగలు ? రాత్రివచ్చిన అమ్మాయిలే మళ్ళీవచ్చి ఎత్తుకుపోయి వుంటారు. రెంటిని...అయితే తను ఇప్పుడేగదా తన పూలబుడగ కుందేలు దగ్గర లాక్కుని పరుగెత్తుకొస్తా...మరి ఇదేమయినట్టు...? ఏమో...! విచిత్రంగా వుంది..!"

ఎంతో ఎంతో ఆలోచించింది వైదేహి. తను మళ్ళీ తెచ్చుకున్న బుడగను ఎవరు కాజేశారో అర్థం కాలేదు...! బహుశ మళ్ళీ ఆ కుందేలే అయివుంటుంది...!" అని సమాధానపడింది వైదేహి. అయితే మనం ఏమిచెప్పినా నమ్మదు వైదేహి...! ★

# న్యాయమే గెలుస్తుంది

వృద్ధరాజు మరణించాడు. పెద్ద కొడుకు రాజయ్యాడు. రాజ వేషం వేసుకుని తిరుగుతున్నాడు. మొదటినుంచీ అతడు గర్విష్ఠి; ముక్కోపి; నిరంకుశుడు. మంచి వాళ్ళనూ, బలహీనులను, నీతిపరులను అవమానించడం అతనికి సరదా. రెండో కొడుకు సజ్జనుడు. అతడు రాజయితే బతికిపోయేవాళ్లమని ప్రజలు అనుకున్నారు. అలా అనుకుంటున్నారని తెలిసి రాజు మరీ మండిపడ్డాడు. సింహాసనం చేతికి రాగానే మొట్టమొదట అతడు చేసిన పని ఏమిటంటే, తమ్మునికి ఒక గుర్రం, మూడు వందల బంగారు నాణాలు ఇచ్చి నగరంలోంచి వెళ్ళగొట్టాడు.

ఆ తరవాత ఒకసారి ఇద్దరూ నగరానికి దూరాన ఒక అరణ్యంలో తటస్థపడ్డారు.

"ఏమోయ్" అని రాజు తమ్ముణ్ణి పిలిచాడు. "ఇప్పుడైనా బుద్ధిగా ఉంటున్నావా? లేక నామీద తిరుగుబాటు లేవదీయాలనుకుంటున్నావా?" అన్నాడు.

"లేదు" అన్నాడు తమ్ముడు. "నీమీద నాకు కోపంలేదు. నువ్వు అన్యాయం చేశావనికూడా నేనెవరితోనూ అనలేదు."

"అంటే నాకు లెక్కచేస్తున్నావా? నీ ఇష్టం వచ్చినట్టు అనుకో. నాకేం భయంలేదు. నా మాటకొస్తే అన్యాయం చెయ్యనిదే ఎవడూ బతకలేడు. అన్యాయం చేస్తేనే ఐశ్వర్యం వస్తుంది; యుద్ధాల్లో గెలుపు లభిస్తుంది," అన్నాడు రాజు.

"అన్యాయం జయించదు. న్యాయమే జయిస్తుంది," అన్నాడు రాజు తమ్ముడు.

"సరే. నీదగ్గిరున్న మూడు వందల నాణాలు పందెం కాయి. మనకి మొదటగా ఎదురుపడే మనిషిని అడుగుదాము. అతడు ఏది చెపితే దానికి ఒప్పుకుందాం."

తమ్ముడు ఈ షరతుకు ఒప్పుకున్నాడు. బయలుదేరారు ఇద్దరూ.

తమ్ముణ్ణి చిన్నతనంనుండీ వెంటాడుతున్న కలిదేవత, వారి మాటలు, వారు ఒడ్డిన పందెం విన్నాడు. అప్పుడు ఒక మునీశ్వరుని వేషంలో వారి కెదురయ్యాడు. వారి ప్రశ్నకు సమాధానంగా అన్యాయమేజయిస్తుందని చెప్పాడు. తమ్ముడు దగ్గరున్న డబ్బంతా కోల్పోయాడు.

అయినా అతడు న్యాయమే జయిస్తుందన్నాడు. ఈసారి గుర్రాన్ని పణంపెట్టాడు. మళ్ళీ కలిదేవత వర్తకుని వేషంలో వచ్చి ఇచ్చిన తీర్పుమూలాన దాన్ని కోల్పోయాడు. మూడోసారి అదే విధంగా తన కరవాలం కోల్పోయాడు.

అప్పుడు రాజు "ఈసారి ఏమి పందెం వేస్తావు? నీదగ్గిర ఇంక మిగిలిన వస్తువు లేమున్నాయి గనుక? నీ చూపును పణం ఒడ్డుతావా?" అని అడిగాడు.

"అవును. అన్యాయంకంటె న్యాయమే గొప్పది. అది నా అచంచల విశ్వాసం," అన్నాడు తమ్ముడు.

రాజు మధ్యవర్తికోసం ఆగకుండా తనే తమ్ముని కళ్లు ఊడబెరికి వేశాడు.

అయినా ఆ యువకుడు తన సహజ శాంతగుణాన్ని, స్థైర్యాన్ని వీడలేదు. అన్నను పల్లెత్తు మాట అనలేదు. కొంత దూరంలో ఒక సరోవరం ఉన్నది. ఆ సరస్సుతీరాన ఒక మామిడిచెట్టు, దానిచుట్టూ అల్లుకుని ఉన్న ఒక పొదరిల్లు ఉన్నాయి. అక్కడికి తీసుకుపోయి తనను వదిలిపెట్టమని అన్నను ప్రార్థించాడు. అక్కడ తమ్ముని వదిలేసి రాజు గుర్రాన్ని, డబ్బును, కత్తిని తీసుకుని నగరానికి వెళ్లిపోయాడు.

అక్కడ అంధయువకుడు కొన్ని గంటలసేపు ఒంటరిగా కూర్చున్నాడు. మనుజమాత్రుడెవడూ ఆ దారిన రాలేదు. చీకటి పడింది. పక్షుల సవ్వడులు తగ్గిపోయాయి.

నక్షత్రాలు ఆకాశంలో ప్రకాశించ సాగాయి. కాని అంధుడైన యువకుడు అనంతమైన అంధకార సముద్రంలో మునిగి ఆ పొదరింటిలోనే కూర్చున్నాడు. కళ్లు పెరికివేసిన బాధను ఎంతో కష్టంమీద ఓర్చుకుంటూ, నిద్రరాక నిశ్శబ్దంగా కూర్చున్నాడు.

కాసేపు గడిచాక, సరోవరంలో నీళ్లు గలగల కదలాడడం, వెండి మువ్వల సవ్వడిలాగా ఎవరెవరో నవ్వడం అతడు విన్నాడు. ఈ రాత్రిపూట సరస్సులో ఎవరు ఇట్మా స్నానం చేస్తున్నారు, అని ఆలోచించాడు. పర్వతాలలోను, సరస్సులలోను, వనాలలోను దేవతలుంటారన్నమాట నిజమేనా? ఈ స్త్రీలు జలదేవతలు కారుగదా? అని తలపోశాడు.

స్నానం చేస్తున్న వారు నిజంగా జలదేవతలే. జలక్రీడలతో అలసిపోయి వారు ఏవో కబుర్లు చెప్పుకో సాగారు. దేవతల వ్యవహారాలు కొంతసేపు, మానవుల వ్యవహారాలు కొంతసేపు చర్చించుకున్నారు. ఒక దేవత ఇలా అంది:

"అవంతీ రాజు కూతురు చాల నాళ్లుగా ఏదో భయంకర వ్యాధితో బాధపడుతోంది. మన సరస్సులో మూడుసార్లు మునిగి లేస్తే చాలు ఎటువంటి వ్యాధి అయినా మటుమాయమైపోతుంది. ఈ సంగతి మానవమాత్రులకెవరికీ తెలియదు. అబ్బ, అవంతి రాజభవనంలో అంతా ఎప్పుడూ ఏడుస్తూనే ఉంటారట; ఇందాక, ఆ భవనం వెనక వనంలోని చిలకలు వచ్చి నాతో చెప్పాయి. అంతే కావాలి, ఈ మానవజాతికి. మనుషులంటే నాకు చెడ్డ ద్వేషం."

తక్కిన జలదేవతలు ఆమె అన్నదానికి అవును, అవును అని అంగీకరించారు.

తరవాత ఎవరి దోవన వారు వెళ్ళిపోయారు. మళ్ళీ నిశ్శబ్దం ఆవరించింది. అంధ యువకుడు అలాగే కూర్చున్నాడు. కొంతసేపటికి పక్షులు మేల్కొన్నాయి. కలకూజితాలకలవరం ప్రారంభమైంది. సూర్యదేవుడు ఏడు గుర్రాల రథం మీద ప్రపంచయాత్ర ప్రారంభించాడు. తెల్లవారినదని తెలుసుకుని యువకుడు లేచి మెల్లిగా సరస్సు ఒడ్డుకు పాకిపోయి నీళ్ళలో దూకాడు. మూడుసార్లు మునిగి లేచాడు. ప్రశాంతమైన ప్రభాత కాంతిలో చరాచర ప్రపంచం ఎంతో సుందరంగా అతనికి తిరిగి దర్శనమిచ్చింది. కళ్ళు బాగుపడ్డాయి. చూపు తిరిగి వచ్చింది. బాధ మాయమైంది.

అయితే అంత ఆనందంలోనూ, అతడు అవంతీ రాజకుమారి సంగతి మరిచిపోలేదు. అవంతి రాజ్యం అక్కడికి అనతిదూరంలోనే ఉంది. మధ్యాహ్నానికి అవంతినగరం చేరుకున్నాడు. బట్టలు మట్టికొట్టుకుని బికారివలె కనిపించినా, అతన్ని రాజభటులు 'ఫలానా రాజకుమారుడని గుర్తుపట్టారు. రాజుదగ్గిరికి తీసుకుపోయారు. అవంతిరాజు అతని కథ అంతా విని అది విశ్వసించాడు. సేవకులను పంపి ఆ సరోవర నీరాలను చాలా కడవలనిండా తెప్పించాడు. ఆ నీటిని తొట్టెలో పోసి రాజకుమారి అందులో మూడుసార్లు మునిగింది. అంతే, ఆమె వ్యాధి వెంటనే నయమైంది. దివ్య తేజస్సుతో ఆమె ప్రకాశించింది.

సరే, అవంతిపాలుడు ఆ రాజ యువకునికి తన కుమార్తెనిచ్చి అతి వైభవంగా వివాహం చేశాడని, అర్థ రాజ్యం కూడా కట్టబెట్టాడని వేరే చెప్పనవసరం లేదు. ఆ తరవాత వాళ్లు కలకాలం సుఖంగా ఉన్నారనికూడా చెప్పనక్కర్లేదు. అయితే అంతటితో కథ అయిపోతుందా మరి?

తన తమ్ముని కళ్లు తాను స్వయంగా ఊడబెరికినా అతని కళ్లు మళ్ళీ వచ్చాయని తెలియగానే దుర్మార్గుడైన అన్నకు ఆశ్చర్యం కలిగింది. ఆలోచించాడు. తాను ఆరోజున తమ్ముణ్ణి కూర్చోబెట్టిన మామిడిచెట్టుదగ్గిర ఏదో మహత్తు ఉండాలనుకున్నాడు. ఆ రాత్రే బయలుదేరి ఆ చెట్టుకింద పొద

రింటిలో దాక్కున్నాడు.

అర్ధ రాత్రికి సుమారు ఇరవై ఉంది. అద్భుత సౌందర్యవతులైన అప్సరః కన్యలు నీళ్ళలోంచి పైకి లేచారు. వెన్నెలలో వాళ్ళు బంగారంలాగా మెరిసిపోతున్నారు. అప్పుడు వారు "అయ్యో, మన రహస్యం మానవులకు తెలిసిపోయింది. మన సరస్సు నీళ్ళు కలుషం అయిపోయాయి. ఇంకెలా? ఇంకెలా?" అని విలాపించసాగారు.

"ఎవరు చేశారో ఈ పాడుపని? ఇక ఈ సంగతి దేశాలన్నిటా పాకిపోతుంది. కుంటివాళ్ళు, గుడ్డివాళ్లు, కుష్ఠురోగులు, క్షయరోగులు మన సరస్సుదగ్గిరికి వచ్చి నానాభ్రష్టం చేసివేస్తారు. ఇంకెలా? ఇంకెలా?" అని విలాపించారు.

దుష్టరాజు వారిమాటలు బాగా వినపడక, కొంచెం ముందుకు జరిగాడు. జరగడంలో అక్కడ చీమే కుట్టిందో, తేలే కుట్టిందో, 'అబ్బా' అని మూలిగాడు.

ఆ మూలుగు విని అప్సరసలు గబగబ బయటికి వచ్చి పొదరింట్లో దాక్కున్న రాజును ఈడ్చుకొచ్చారు. అతడెంత ప్రయత్నించినా వారిని విడిపించుకోలేకపోయాడు. "ఇతడే మన రహస్యం బయటపెట్టి ఉంటాడు. దొరికాడు పాపాత్ముడు" అని తిడుతూ, కొడుతూ అతన్ని నీళ్లలోకి తీసుకుపోయి ముంచేశారు. ఊపిరాడక దుష్టరాజు చచ్చిపోయాడు.

కథ కంచికి పోయేముందు, అన్యాయం ఓడిపోయి, న్యాయమే గెలిచిందని మీరందరూ గ్రహించే ఉంటారు. 

 అబల 

(11 వ పేజీ తరువాయి)

ఇంకా దూరంగా ఉండగానే ఇంట్లో నుంచి నవ్వులూ, కేకలూ, కేరింతాలూ వినిపిస్తున్నాయి. కమల నాలుగంగలలో లోపలికి వెళ్ళిపడింది. అంతా ఆమెను చుట్టివేశారు. అభినందనలవర్షం కురిపించివేశారు. చేతులు పట్టుకొని ఊపివేశారు. కమల అందరితో 'షేక్ హాండ్' చేసింది. 'కంగ్రాచ్యులేషన్స్' చెప్పింది. పరీక్ష తప్పినవారుకానీ, పార్టులు పోయినవారు కానీ అక్కడ లేరు. అందువల్ల అందరూ కొద్దిసేపు వారినిగురించి తలచుకొని 'పాపం' అని సానుభూతి వ్యక్తపరచి వాళ్ళను మరచిపోయారు. మళ్ళీ నవ్వులూ, పరిహాసాలూ, భవిష్యత్పథకాల్లోనూ పడిపోయారు. నీవేంచేస్తావంటే నీవేంచేస్తావు అని ఒకరినొకరు అడుగుతున్నారు. వాళ్లలో ముగ్గురు ఇంటర్మీడియేట్‌తోనే చదువాపివేస్తామన్నారు. వాళ్లకు త్వరలో పెళ్ళిళ్ళు కాబోతున్నాయి. ఇది విని తక్కినవాళ్ళంతా ఆ ముగ్గురిని ఎగతాళి చేయడం మొదలుపెట్టారు. ఇంటర్మీడియేట్ చదువంటే త్రిశంకుస్వర్గంలాంటిదన్నారు వాళ్ళు. ఉత్తి పిరికిపందలన్నారు. తాము చక్కగా బి. ఏ. చదువుతామని గొప్పగా చెప్పుకున్నారు. కమలలాగే వాళ్ళకీ బి.ఏ. అనిపించుకోవాలనే ఆకాంక్ష తప్ప మరొకటిలేదు. కాబట్టి బి. ఏ లో ఏవిషయాలు తీసుకోవాలో నిర్ణయించుకోలేదు. ఏదైనా అందరం ఒక్కటే 'సబ్జక్టు' చదువుదామంది జానకి. కమల తప్పక అలాగే చేదామంది. తరువాత ఫలహారాలూ, పానీయాలూ సేవించి ఒకకట్టగా బయలుదేరి, తెలిసిన లెక్చరర్ల ఇళ్ళకుపోయి నమస్కారాలు చెప్పి, కొంతసేపు పార్కులో తిరిగి చివరికి సినిమాకు పోయి ఫస్టుక్లాసు టికెట్లుకొని సినిమాచూసి వచ్చారు.

కమలఇంటికి చేరుకునేటప్పటికి అంతా నిద్రపోతున్నారు. కమల కొంతసేపు చూసిచూసి తలుపు తట్టింది. వదినగారు సణుగుకుంటూవచ్చి తలుపు తీసింది. కమలతో ఏమీ మాట్లాడకుండానే వెళ్లి పడుకుంది. కమల కాకలివేస్తున్నా అన్నం పెట్టుకోవడానికి బద్ధకంవేసి కడుపు మంచినీళ్ళతో నింపుకొని అలానేపోయి మంచంమీద పడింది.

మిగతా వాళ్లు ఎగతాళిచేస్తున్నారనే కోపంతో ఇంటర్మీడియేట్‌తో చదువు ఆపివేస్తున్న ముగ్గురూ జానకియింటికి రావడం మానివేశారు. బి. ఏ చదివేవాళ్ళే ఇప్పుడు రోజూ సమావేశమవుతున్నారు. ఏ 'సబ్జక్టు' తీసుకోవాలనే విషయం తర్జనభర్జనలు జరిపించి చివరికి 'ఎకనమిక్స్'ను స్థిరపరచుకున్నారు. కమల అంతకుముందు పాసయిన దగ్గరనుంచి తనకు పనికివచ్చే పుస్తకాలు సంపాదించి అవి అత్యాసక్తితో చదువసాగింది. పరీక్షల ముందుకూడా అంతధ్యానంతో చదవలేదేమో! వీలైనప్పుడెల్లా జానకియింటికి పరుగెత్తుకుపోతోంది. ఇప్పుడు వదినగారు చెప్పిన పనులుకూడా సరిగా చేయడంలేదు. ఆమె సణుగుళ్లు అసలేపట్టించుకోవడంలేదు. కాలేజీలో సీట్లకోసం దరఖాస్తులు పెట్టారు జానకీవాళ్లు. అదిచూసి తనుకూడా అవేళే దరఖాస్తు పంపించాలనీ అన్నగారితో చెప్పి 'రిజిస్ట్రేషన్ ఫీ' తీసుకోవాలనీ ఉత్సాహంలో ఉరకలు వేసుకుంటూ వచ్చింది యింటికి.

గోపాలం పట్టెమంచంమీద కూర్చొని చంటిపిల్ల బుచ్చిని మోకాళ్లమీద ఎక్కించుకొని ఆడిస్తున్నాడు. కమల లోపలకు పరు

తివేస్తోంది. గోపాలం ఒకసారి చెల్లెలికేసి చూసి మళ్ళీ బుచ్చిని ఆడిస్తూ నవ్వుతున్నాడు. కమల కొంతసేపు అతని సరదా చూస్తూ, ఆఖరికి ఆగలేక "అన్నయ్యా" అంది. గోపాలం తల పైకెత్తి నవ్వుతూనే "ఏమే అమ్మాయి. నీవొక్క క్షణం ఇంటిపట్టున ఉండడం లేదుట. మీ వదినమాట వినిపించుకోవడం లేదుట. బుచ్చికూడా అంటోంది అత్తయ్య నాతో మాట్లాడడంలేదని. కాదూ బుచ్చీ" అని బుచ్చిని మరింతగా ఎగరవేస్తున్నాడు. బుచ్చి పకపక నవ్వుతోంది. కమల దగ్గరకు వచ్చి "ఏమే బుచ్చీ నా మీద పితూరీ చెప్పావా?" అంది నవ్వుతూ. బుచ్చి మరింతగా నవ్వింది. అంతే. కమల అన్నగారి వైపు తిరిగి "అదిసరే అన్నయ్యా, అందరూ కాలేజీలో సీట్లు రిజర్వు చేయించుకుంటున్నారు. నేనుకూడా దరఖాస్తు పెట్టుతాను ఈ వేళ. నాకు రెండురూపాయ లియ్యిరా" అంది. గోపాలం జవాబివ్వలేదు. బుచ్చిని ఉయ్యాల ఊపుతూనే వున్నాడు. కమల మళ్ళీ చెప్పింది. "అందరూ ఈ వేళే రాస్తున్నారన్నయ్యా. నేనుకూడా యీ వేళే దరఖాస్తు రాస్తానన్నయ్యా." గోపాలం ఇంకా మాటపలకలేదు. కమల అన్నగారి మొగంలోకి చూసింది. అతని మొగంలో అంతకు ముందున్న నవ్వు యిగిరిపోయి తీవ్రవైఖరి వచ్చివేసింది. ఎందుకో అర్థంకాలేదు కమలకి. అప్పుడే వదినగారటువచ్చింది. కమల మళ్ళీ అడిగింది. "ఏమన్నయ్యా, యేమంటావు?" అని. గోపాలం మెల్లగా తలెత్తకుండానే "ఇక చదువు చాలమ్మా" అన్నాడు.

ఈ పిడుగుపాటుకు కమలమనస్సు ఒక్క క్షణం ఖాళీ అయిపోయింది. "ఊఁ?" అంది యాంత్రికంగా.

"ఏముందమ్మా, ఇక చదివింది చాలని చెబుతున్నారు" అంది వదినగారు బియ్యపు చేట ముందు వేసుకుని కూర్చుంటూ.



"తెలుగదేలయన్న దేశంబు తెలుగేను
తెలుగువల్లభుండ......"

విక్రమ్ ప్రొడక్షన్సువారి "తెనాలి రామకృష్ణ"లో కృష్ణదేవరాయలుగా ఎన్. టి. రామారావు.

కార్యాలయంలో ఏర్పాటైనగోష్ఠిలో ప్రసంగిస్తూ శ్రీ రెడ్డి పైవిధంగా అన్నారు. గోష్ఠికి శ్రీ రామకృష్ణప్రసాద్ (సారథీ ఫిలిమ్స్) అధ్యక్షత వహించారు.

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి పాటల రచన, పాలగుమ్మి పద్మరాజు కథారచన, ఎస్. వి. రంగారావు నటన, సి. గోపాలరత్నం సెన్సారింగ్, బి. ఎన్. రెడ్డి దర్శకత్వం గూర్చి ఉపన్యసించారు. వీరందరూ ముఖ్యంగా తమతమ సాధకబాధకాలనే వివరించారు. సినిమాలలో ఎవరికివారే తమదే నిమ్నజాతి, తమపనే కష్టం, ఇతరులంతా బాగానే ఉంటున్నారు అనే అభిప్రాయం వెల్లడించారు. మొత్తంమీద ఏ ఒక్కరికీ తాము సంతృప్తికరంగా పని చెయ్యగలుగుతున్నాము అనే భావం ఉన్నట్లు కనిపించలేదు. తమ కర్తవ్య నిర్వహణలో కలుగుతున్న అసంతృప్తి ఇప్పట్లో తొలగుతుందన్న ఆశకూడా ఎవరికీ ఉన్నట్లు కనిపించలేదు.

మొదట కృష్ణశాస్త్రిగారు తమ సహజ వ్యంగ్య, హాస్యధోరణిలో గోష్ఠికి ఉపక్రమించారు. తాము సినిమాల్లోకి రావడానికి బి. ఎన్. రెడ్డిగారిఒత్తిడి, ఏ సమకాలిక కవీ ఎన్నడూ చూడనంతధనం కళ్లజూడవచ్చుననే ఆశ, అధికసంఖ్యాకులకు తమ పేరు పరిచితమవుతుందనే కీర్తికాంక్ష—ఈ మూడూ కారణాలని చెప్పారు. పాటల్ని గూర్చి చెబుతూ "పాటలు మూడు రకాలుగా వ్రాయవచ్చును. సంగీతం వచ్చినవాడే పాట వ్రాయడం, పాటవ్రాస్తూనే సంగీతంకూడా నిర్ణయించుకోవడం మొదటి రకం. ఇది క్షేత్రయ్య, త్యాగయ్య, అన్నమాచార్యులు మొదలైనవారి పద్ధతి. పాట ఒకడు వ్రాసి ఇస్తే మరొకడు దానికి ట్యూన్ కట్టడం రెండో రకం. ముందు ట్యూన్ కట్టిఇస్తే తరవాత దానికి సరిపోయిన పాట వ్రాయటం మూడో రకం. ఈ మూడో రకం పాటలే ఇప్పుడు చిత్రాల్లో సాధారణంగా వినిపిస్తున్నాయి. సినిమాల్లోకి రాగానే నన్నెదుర్కొన్న మొదటి చిక్కు ఇది," అని ఆయన అన్నారు.

"ఇదివరకు నేను నా కష్టసుఖాలు చెప్పుకునేందుకు కవిత్వం వ్రాశాను. ఇప్పుడు ఇతరుల కష్టసుఖాలు, అంటే చిత్రంలోని వివిధ పాత్రల కష్టసుఖాలను వెల్లడించే పాటలు వ్రాయవలసివచ్చింది. ఇది నాకు కొత్త గనుక అదో చిక్కైంది. తరవాత, సినిమా అనేకమంది చూస్తారు కనుక అనేకమందికి అర్థమయ్యే మాటలే వాడాలి. చందమామతో ప్రతి సినిమా నాయికకూ పని ఉంటూఉంటుంది గనక చంద్రుణ్ణి చందమామ, జాబిలి. ఎప్పుడైనా విధిలేకపోతే నెలరాజా అనిమాత్రమే అనాలి. కోయిలతో కూడా పనివుంటుంది గనక దాన్ని కోయిల అనే అనాలి; పరభృతం వగైరా మాటలు పెద్దవైపోతాయి. ఇందువల్ల సినిమాపాటల్లో వాడదగిన మాటలు తగ్గిపోయి, అందరు కవులూ వాటినే పట్టుకుని వేళ్ళాడి, పాతబడిపోతాయి. అందరికీ తెలిసిన కొత్త మాటలు వెదుక్కోడం అనే చిక్కు అప్పుడు వస్తుంది. చందమామ, కోయిలవంటి మాటలు విని విని విసిగిన జనానికి, ఏదో 'ఏరువాక' లాంటి శబ్దం వినబడగానే కొత్తగా వినిపించి అది అధికాదరం పొందుతుంది. జానపదులకు చక్కని భావ, చక్కని గేయాలు లేవని కాదు. వాటిని అపశబ్దభయం లేకుండా వాడడం ఎలాగో నాకింకా తెలియలేదు. ఈ చిక్కులన్నిటినీ తొలగించుకోవడంలో బి. ఎన్. రెడ్డిగారు నాకు చాలా సహాయం చేశారు," అని కృష్ణశాస్త్రిగారు అన్నారు. సినిమాపాటకు సంగీతమే ప్రధానమనీ, సంగీతబలంవల్లనే అది ప్రజాదరం పొందుతుందనీ కూడా ఆయన తెలిపారు.



హిందీ నటి నూర్.

తరవాత శ్రీ పాలగుమ్మి పద్మరాజు మాట్లాడుతూ సినిమాలలో రచయిత 'నిమ్న జాతి' కి చెందినవాడని అన్నారు. "కథలు ఇతరులు యిస్తే సంభాషణలు వ్రాయడమే తప్ప, స్వయంగా కథలు రచించే రచయితలు ఆట్టేమంది ప్రస్తుతం సినిమారంగంలో లేరు. ఇప్పటి సినిమాల్లో కథ ఒక్కటే ముఖ్యం కాదు. తారలు, పాటలు, నాట్యాలు మొదలైన అనేక ఆకర్షణలవల్ల చిత్రం విజయవంతం అవుతుంది. ప్రతి సినిమాకథకీ



మద్రాస్, బ్రాడ్వే టాకీస్‌లో "ఝనక్ ఝనక్" విడుదల రోజున కె. దాతే సంధ్య, శాంతారాం, బ్రాడ్వే టాకీస్ మేనేజింగ్ పార్ట్నర్ సి. ఎస్. రామానుజం. శాంతారాంకు బహూకరింపబడిన రజత వస్తువును ఫొటోలో చూడవచ్చును.

సంబంధించిన విలువలు ముఖ్యం కావు," అని శ్రీ పద్మరాజు అన్నారు. అన్ని లక్షణాలతో కూడిన ఒక కథ తీసుకోవడం కంటె శృంగారం ప్రధానంగా ఒకకథ, హాస్యం ప్రధానంగా మరో కథ, అలా ఒక్కొక్క లక్షణంతో ఒక్కొక్క కథ తీసుకుని చిత్రాలు తీయడం మంచిదని ఆయన సూచించారు.

శ్రీ ఎస్. వి. రంగారావు మాట్లాడుతూ నిమ్న జాతివారు కవులు కాదనీ, నటులు లేరనీ అన్నారు. కనీసం ఒక అయిదారేళ్ల క్రితం వరకూ సినిమా నటులకు గౌరవం లభించేది కాదనీ, ఇప్పుడిప్పుడే వారికి గౌరవం వస్తోందనీ అన్నారు. "పాత్రపోషణం ఒక గొప్పవిద్య. ప్రతి మనిషికీ ప్రత్యేకత ఉన్నట్లే ప్రతి పాత్రకు ప్రత్యేకత ఉంటుంది. ఒకపాత్రలాగా మరో పాత్ర భావప్రకటనం చెయ్యదు. అందరికీ కోపం వచ్చినా, కోపాన్ని ఒకరు ప్రకటించినట్లుగా మరొకరు ప్రకటించరు. అలాగే హాస్యం మొదలైనవి కూడాను. అందుచేత పాత్ర స్వభావాన్ని అర్థం చేసుకుని నటుడు నటిస్తాడు. అతనికి దర్శకుడు సహాయం చేస్తూఉంటాడు," అని శ్రీ రంగారావు అన్నారు.

సెన్సార్ల సంఘ సభ్యుడు శ్రీ వి. సి. గోపాలరత్నం సెన్సార్‌షిప్ సమస్యలను వివరించారు. చలనచిత్రంలో ఏది బాగా లేకపోయినా ముందు సెన్సార్లను తిట్టడం పరిపాటి అయిందని ఆయన అన్నారు.

# దర్శకత్వం, నటన, సెన్సార్‌షిప్

శృంగారం, హాస్యం, విలనీ, కొగ్గుపమాదా లాంటివి కొన్ని లక్షణా లుండితీరాలి. ఈ లక్షణాలమధ్య పాత్రచిత్రణం మట్టికొట్టుకు పోతుంది. ఏ చిత్రంలో చూసినా ఒకేరకం పాత్రలు కనిపిస్తాయి. హీరో, హీరోయిన్ వేషాలకు ఉన్నవారు ఇద్దరు ముగ్గురికంటె లేరుకనుక వారినే దృష్టిలో పెట్టుకుని పాత్ర రచన జరుగుతుంది. ఇదంతా చూస్తే సినిమాలో కథ ముఖ్యం కాదనిపిస్తుంది. సినిమా ప్రజారంజకంగా ఉండాలి. కళవు



మద్రాస్, ప్లాజా థియేటరులో "శ్రీ 420" ప్రివ్యూ ఇచ్చినప్పుడు హాజరైన రాజ్‌కపూర్, నర్గీస్, పత్రికా ప్రతినిధులు.

పాటల్లో రాగసాంకర్యం జరిగితే సెన్సార్లు నిద్రపోతున్నారా అని అడుగుతారు. నాట్యాల్లో సంప్రదాయాలను పాటించకపోతే సెన్సార్లను నిందిస్తారు. అయితే చలన-చిత్రం కళాత్మకంగా ఉండేట్లు చూచే బాధ్యత మాదికాదు. ఏ లోపాలు కనబడినా దణ్ణం పెట్టి ఊరుకోవడంతప్ప మేము ఏమీ చెయ్యలేము. చలనచిత్రాలను పరిశీలించేటప్పుడు మేము గుర్తుంచుకోవలసిన కొన్ని నిబంధనలను ప్రభుత్వం తయారు చేసింది. వాటినే మేము పాటిస్తాము. సెక్స్‌కు సంబంధించిన అశ్లీలాలను ఆమోదించరాదనేది ఒక నిబంధన. అవయవ ప్రదర్శనంలాంటివాటిని, సంభాషణలలో అశ్లీలం ధ్వనించేవాటిని తొలగించమని చెబుతాము. రాజకీయంగా ఉద్రేకాలు రెచ్చగొట్టేవాటిని ఆమోదించరాదనేది మరొక నిబంధన. ఈ నిబంధలను తెలివిగా తప్పించుకోవడానికి నిర్మాతలు ప్రయత్నిస్తూ ఉంటారు. మేము అన్యాయంగా ఏదృశ్యాన్ని పడితే ఆదృశ్యాన్ని కత్తిరించేస్తున్నామని గోలపెడుతూ ఉంటారు. నిజానికి మేము కత్తిరించిన దృశ్యాలన్నీ చెత్త. ఈ చెత్తను చిత్రాల్లోంచి తొలగించివేస్తున్నందుకు మమ్మల్ని అభినందించడం పోయి తిట్టడం అన్యాయం," అని ఆయన చెప్పారు.

దర్శకత్వాన్నిగూర్చి శ్రీ బి. ఎన్. రెడ్డి మాట్లాడుతూ, దర్శకుడు ఈ రోజుల్లో చేస్తున్న పని ఏమిటో తమకే తెలియడం లేదన్నారు. యుద్ధానంతర కాలంలో దర్శకునికి ప్రాముఖ్యం తగ్గిపోయిందనీ, నిర్మాతకు, పెట్టుబడిదారుకూ ప్రాముఖ్యం హెచ్చిందనీ అన్నారు. "అనేకులు నిపుణుల కలయికవల్ల సినిమా తయారవుతుంది. నటులు, ఫొటోగ్రాఫరు, సౌండ్ రికార్డిస్టు, సంగీత దర్శకుడు, కళాదర్శకుడు మొదలైన పలువురు నిపుణులుంటారు. వీరి ప్రత్యేక నైపుణ్యాలన్నిటినీ సమన్వయంచేసి చిత్రం మొత్తం మీద రక్తికట్టేటట్లు చేయడం, వారినైపుణ్యం రాణించే అవకాశం కలిగించడం దర్శకుని పని అని నేననుకుంటాను. చిత్రం చూచినప్పుడు, ఫలానా విషయం బాగుంటే దానికి ఎవరు బాధ్యులు, ఫలానా విషయం బాగుండకపోతే ఎవరు బాధ్యులు అని విమర్శకులు ఆలోచించాలి. అన్నీ ఒకరి నెత్తిమీదే రుద్దకూడదు. సంగీతమో మరొకటో బాగుంటే సంగీత దర్శకుణ్ణో, మరొకడినో మెచ్చుకోవడం, బాగులేకపోతే 'దర్శకుడు ఏంచేస్తున్నాడు' అని దర్శకుణ్ణివిమర్శించడం జరుగుతోంది. ఇది భావ్యంకాదు," అని శ్రీ రెడ్డి అన్నారు.

కొత్త నటులు సినిమాలలోకి రాకపోవడానికి కారణం చెబుతూ "కొత్తవారిని పరీక్షించడానికి మార్గం, సావకాశం సినిమాలలో లేదు. నాటకాలు బాగా అభివృద్ధి అవుతుంటే, సమర్థులని తేలిన నటులను సినిమాలలోకి తీసుకురావడానికి వీలుంటుంది. లేకపోతే కష్టమవుతుంది," అని ఆయన చెప్పారు.

శ్రీ పందిరి మల్లికార్జునరావు వందన సమర్పణతో సభ ముగిసింది. ★

## "శ్రీ 420"

రాజ్ కపూర్ నిర్మించిన "శ్రీ 420" హిందీ-చిత్రం మద్రాస్‌లో ప్లాజా,ప్రభాత్ థియేటర్లలో ప్రస్తుతం ప్రదర్శింపబడుతోంది. మొదట నీతిగా ప్రవర్తించుతూ జీవనోపాధి సంపాదించడానికి ప్రయత్నంచేసి, విఫలుడై అవినీతిమార్గాన ధనార్జన చేయజూచిన ఒక యువకుడు తుదకు అంతరాత్మ ప్రబోధంవలన అవినీతిని త్యజించి తిరిగి సన్మార్గావలంబి కావడం ఈ-చిత్రంలో కథావస్తువు. ఆ యువకుడుగా రాజ్ కపూర్, అతన్ని ప్రేమించిన యువతిగా నర్గీస్, అతన్ని అవినీతిలోకి దింపిన దుష్టపాత్రలుగా నదీరా, నీమో, తదితరులు నటించారు. దర్శకుడు రాజ్ కపూర్; సంగీత దర్శకులు శంకర్, జైకిషన్.

ప్రపంచంలో జరిగే అనేక అన్యాయాలకు, అవినీతికి ముఖ్య కారణం డబ్బు అనే సత్యం చూపించడానికి రాజ్ కపూర్ ఈ చిత్రంలో ప్రయత్నించారు. చిత్రంనిండా ఉన్న అసత్యాల మధ్య ఈ సత్యం ఇరుక్కుపోయికూడా కొంతవరకూ ప్రకాశించడానికి దాని సహజబలమే కారణం. రాజ్ కపూర్ నటనలోను,కొన్ని పన్ని వేశాలలోను చార్లీచాప్లిన్‌ను అనుకరించి, ప్రేక్షకులకు వినోదం కలిగించారు. కాని చాప్లిన్ చేసే 'బర్లెస్క్' చిత్రం అంతటా ఒకే విధంగా ఉండడమేకాక దానిజనక తీవ్రమూ, గంభీరమూ అయిన వ్యంగ్యం కూడా ఉంటుంది. అతడు పైగా అసహజ పద్ధతుల ద్వారా వాస్తవికతను సాధిస్తాడు. రాజ్ కపూర్ ఈ రెంటినీ 'మిళాయ్' చేసి విఫలులయ్యారు.

శంకర్, జైకిషన్‌ల సంగీత దర్శకత్వం ప్రజాదరపాత్రంగా ఉన్నది. ముఖేష్‌పాడిన 'మేరా జూతా హై జాపానీ' అనే పాట,

తార నళినీజయవంత్.





"శ్రీ 420"లో నర్గిస్.

లతా పాడిన 'ఈచక్ దానా బీచక్ దానా' అనేపాట, మరి ఒకటి రెండుపాటలు ఇదివరకే విశేషప్రచారం పొందినవి. ఈ పాటల కోసం, వినోదంకోసం ఈచిత్రాన్ని చూడవచ్చును. ★

## చైనాలో "మల్లీశ్వరి"

వాహినీవారి "మల్లీశ్వరి" చైనాలో జరుగుతున్న భారతీయ చలన చిత్రోత్సవంలో ప్రదర్శన నిమిత్తం పంపబడింది. తెలుగు చిత్రం విదేశాలకు వెళ్ళి ప్రదర్శింపబడే అవకాశం కలగడం బహుశా ఇదే మొదటిసారి. అందులోనూ ఉజ్జ్వల సంగీత చిత్రం, ఉన్నవాటిలో ఆంధ్రులు సగర్వంగా చూపించుకోదగిన చిత్రం, ఇదివరలో విదేశాలకు వెళ్ళిన ఇతర భాషా చిత్రాల్లో చాలావాటికంటె ఉత్తమచిత్రం "మల్లీశ్వరి" ఈవిధంగా విదేశ ప్రదర్శన గౌరవం పొందడం అన్నివిధాలా సంతోషించదగినది.

శ్రీ బి. ఎన్. రెడ్డి దర్శకత్వాన, పద్మరాజుగారి సంభాషణలతో, కృష్ణశాస్త్రి గారి పాటలతో "భాగ్యరేఖ" చిత్రం త్వరలో ప్రారంభం కాగలదని తెలుస్తున్నది. ముందు పాటలు రికార్డు చేస్తున్నారు.

ఈ చిత్రం తరవాత వాహినీ ప్రొడక్షన్సు తరఫున బి. ఎన్. రెడ్డిగారు మరొక చిత్రం, బహుశా 'కౌస్త్యమ్' చిత్రం తీస్తారట.

## "సక్కుబాయి" నాటకం

స్పోర్ట్ మినర్వక్లబ్ (మద్రాసు) తెలుగు లలితకళాశాఖ అక్టోబరు 28 వ తేదీ సాయంత్రం అన్నామలై హాలులో "సక్కుబాయి" తెలుగు నాటకం ప్రదర్శించారు. పుట్టకురుపు నివారణ సహాయనిధికోసం ఈ నాటకం ప్రదర్శించారు. డా॥ ఎమ్. వి. రావు, కాశీపతిగా శ్రీమతి తిలకం సక్కుబాయిగా, కుమారి కళావతి రాధగా, టి. వి. సుబ్రహ్మణ్యం ఆర్తిగా, బి. ఎస్. ఆర్. దుర్గారావు యోగిగా, నటించారు. కె. వి. నరసింహారావు, బి. ఆర్. సుబ్బిరెడ్డి, జె. కె. నాగరాజు మున్నగువారు తదితర నటులు. సంగీతం శ్రీ దాసరి రామారావు, ఆయన బృందం సమకూర్చారు.

నాటక సందర్భంలో జస్టిస్ డబ్ల్యు. ఎస్. కృష్ణస్వామి నాయుడు, ఆంధ్రవాణిజ్య మండలి అధ్యక్షులు శ్రీ జె.వి. సోమయాజులు, శ్రీమతి వల్లముత్తు రామమూర్తి, డా॥ అరుణాచలంగార్లు నాటకాన్ని ప్రశంసిస్తూ మాట్లాడారు. ★

Printed and Published for Nageswara Rao Estates Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press. 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.



కాశ్మీరు, దాల్ సరస్సులో పేదలనౌకా గృహాలు

ఫొటో, పి సి రెడ్డి—కర్నూలు.